# సృజన



అడవిలోని వెన్నెల
ట్రిగర్ నొక్కి అడవిలో చంద్రుణ్ణి
వెలిగించిన
అమరుల రక్తానికి తెలుసు



ఆదివాసుల పోరాటాలలో
అమరులైన వీరులకు
ఈ సంచిక అంకితం

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

**174/175** మాసపత్రిక ఏప్రిల్/మే **1990**

ఈ సంచికలో ...



నిర్వాహణ :

**సాహితీ మిత్రులు**

సంవత్సర చందా రు. 40. ఈ సంచిక రు. 4.

Edited, Printed and Published by P. Hemalata, Flat 14, Block 2, MIG II, Bagh Lingampalli, Hyderabad 500 044 and Printed at Nagendra Press Vijayawada - 520 002

Working Editor : Vara Vara Rao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

174/175 మాసపత్రిక ఏప్రిల్/మే 1990


ఈ సంచికతో ...




నిర్వాహణ :

సాహితీ మిత్రులు

సంవత్సర చందా రు. 40. ఈ సంచిక రు. 4.

Edited, Printed and Published by - P. Hemalata, Flat 14, Block 2, MIG II, Bagh Lingampalli, Hyderabad 500 044 and Printed at Nagendra Press, Vijayawada - 520 002

Working Editor : Vara Vara Rao

## మళ్ళీ అదే ఆవరణ - మరింత త్యాగారుణిమ

**1983** ఏప్రిల్ 20 న ఇంద్రవెల్లి మృతవీరుల స్థూపావిష్కరణ జరిగింది. **1984** ఏప్రిల్ సృజన అడవి సంచికగా వెలువడింది. **1985** ఏప్రిల్ **20** న ఇంద్రవెల్లి మృతవీరుల సంస్మరణ జరుగకుండాచేసి ఆ సభకు వెళ్ళిన ప్రొఫెసర్ మనోరంజన్ మొహంతీ, డాక్టర్ బాలగోపాల్ తదితరులను పోలీసులు గుడిహత్నూరువద్ద అరెస్టుచేసి మూడురోజులపాటు అక్రమ నిర్బంధంలో పెట్టి తప్పుడు కేసు పెట్టి వదిలేసారు. సభదాకా వెళ్ళిన గద్దర్, ఏక్‌నాథ్‌సాళ్వేలకు తుపాకులు ఎక్కుపెట్టి పాడమన్నారు. మాట్లాడమన్నారు. అయినా అప్పటికదే ఆఖరు సభ.

**85** లోనే దీపావళి రోజు ఏబీవీపీ గూండాలు ఇంద్రవెల్లి స్థూపాన్ని దీపావళి మందుల పాతుతో కూల్చాలని ప్రయత్నించారు. **86** మార్చి **21** న పోలీసులు స్థూపాన్ని డైనమైట్ పెట్టి కూల్చారు.

**87** లో అల్లంపల్లి ఎదురుకాల్పుల తర్వాత ఆదిలాబాద్ జిల్లాను ఆదర్శ జిల్లాగా ప్రకటించి 'గాయపడిన గోండుల ఉపశమనం' కలిగించాలని ఉద్దేశించి స్థూపాన్ని మళ్ళీ నిర్మించి జిల్లా అధికారులు ఎర్రరంగు వేసి సుత్తి కొడవలి జెండా ఎగరేసారు. కాని త్వరలోనే పోలీసులు సుత్తి కొడవలి జెండా స్థానంలో జాతీయ జెండా ఎగురవేసి స్థూపానికి తెల్లరంగు వేసారు.

**1985-89** మధ్యకాలంలో ఇంద్రవెల్లి మృతవీరుల సంస్మరణ గోండు గూడాలల్లో జరిగింది

ఈసారి **90** ఏప్రిల్ **20** న జిల్లా గిరిజన రైతుకూలీ సంఘం మృతవీరుల సంస్మరణ సభ మళ్ళీ స్థూపం దగ్గర జరుపుకున్నది, స్థూపానికి ఎర్రరంగువేసి, సుత్తికొడవలి జెండా ఎగరేసారు. లక్షమందికిపైగా హాజరయిన ఈ సభ ఇంద్రవెల్లి త్యాగాలు వృధా కావని ప్రపంచానికి చాటి చెప్పింది - అందుకే మళ్ళీ ఈ ముఖ చిత్రం, అంతర్ముఖ చిత్రం.

# ఇంద్రవెల్లి కమ్యూన్

సకల సంపదలుగల్ల దేశమున
దరిద్రమెట్లుండె

నో మరెప్పుడయినా చెప్పుకుందాంగానీ సంపదలకు, వనరులకు, మానవ వనరులకు కాణాచి అయిన ఆదిలాబాదు జిల్లా మాత్రం ఇవ్వాళ కృత్రిమ కరువు కత్తెరలో కటకటలాడుతున్నది. అవును కృత్రిమ కరువే. ఆదిలాబాదు జిల్లాలో గోదావరి, పెన్ గంగ, ప్రాణహిత, వార్ధానదులు ప్రవహిస్తున్నవి. కొండచెరియల వెంబడి గలగల పారే సెలయేళ్ళకు లోయల్లో ఊటబారే చెలిమలకు లెక్కలేదు. ఎండల్లో డొక్కలెండి నరాలు తేలినట్లుండే అడవి ఒక్క వాన చినుకు పడగానే పచ్చగా నిగనిగలాడుతుందిగానీ ఆదిలాబాదులో ఆదివాసులు మాత్రం ఆరుగాలం నీళ్ళకు కటకటపడుతూనే వుంటారు. రాష్ట్రంలో కెల్లా జలవనరులు అతి తక్కువగా అందుకున్న జిల్లా ఆదిలాబాదు. అందుకే పోచంపాడు, కడెం, సాత్నాల ప్రాజెక్టులుగానీ, సరస్వతి కాలువగానీ ఈ జిల్లా కొరకుకాదు, మరీ ముఖ్యంగా ఈ జిల్లా ప్రజల కొరకు కాదు అని గ్రహించడం కష్టంకాదు. అడవి పోడుచేసుకున్న పొలాలకు నీళ్ళందకపోవడమే కాదు గోండు స్త్రీలు పటారులమీద (కొండ అంచులమీద) మైళ్ళ తరబడి నడచిపోతేతప్పతాగే నీళ్ళు దొరుకవు. ఆదిలాబాదు అడవంటే టేకుచెట్లు మద్దిచెట్ల అడవి కాళిదాసు మేఘసందేశంలో వర్ణించిన మేఘుని మార్గంలోని సాల వృక్షాల పంక్తి ఇక్కడి నుంచి సాగి గడ్ చిరోలీ జిల్లాలోని రామ్ టెక్ అడవులకు ఎగబాకిందే ఇక్కడి ప్రజలకు సిరిపురం (సిర్ పూర్) వుంది. పోనీ సర్ సిల్క్ పురముంది. కాని నీ నరాలె మొగ్గాలుగా బట్టలెన్నో నేసినావు ఉడుకె వనిదిరో వణుకె వనిదిరో అన్నట్లు అక్కడ బిర్లాల వస్త్ర పరిశ్రమలో తయారయ్యే పట్టు కలవారి శవాల మీద కప్పడానికైనా దొరుకుతుందేమోకానీ పేదలకక్కడ వాళ్ళు పండించే పత్తి పంటకు గిట్టుబాటు ధరకూడ దొరకదు. ఒంటిమీద బట్టలేక ఎండకూ చలికీ అక్కడి ఆదివాసుల శరీరాలు నల్లరేగడి నేలలా దుమ్మురేగుతూ వుంటాయి. నెర్రెలుపాసి వుంటాయి.

ఇక్కడ కాగజ్ నగర్ వుంది నిజం చెప్పాలంటే ఇక్కడ ప్రజలకు కాగితంతో పనేలేదు. వెదురు బొంగులేకాదు ఇక్కడ కష్టజీవుల ఎముకలు నుజ్జు నుజ్జై కమ్మటి వాసనవేసే కాగితంగా రూపాంతరం చెందితే ఆ కాగితం వేసే

విశ్వరూపంలో ఆదివాసి ఎంత పరాయివాడయిపోయాడో, ఎక్కడ గల్లంతయి
పోయాడో చూసి తీరాల్సిందే. ఆ కాగితం మీదనే ఆదివాసిమీద యుద్ధం ప్రకటించే
అడవి చట్టాలు వస్తాయి. (1980 కేంద్ర ప్రభుత్వం అడవి చట్టం) కాగితం మీద
నైనా తమ భూములను తమకు నిలుపుతుందని భ్రమపడే 70 క్లాజు ఒకటి మళ్ళీ
శాసనసభ కుట్రలోని కాగితంమీద రద్దవుతుంది. కాగితం మీదనే ఆదర్శ జిల్లాలు
ఏర్పడతాయి. కాగితం మీదనే గిరిజనాభివృద్ధి పథకాలన్నీ వస్తాయి ఆదివాసులపట్ల
ఎందరెందరికోవున్న ఆదరాభిమానాలు, ఆందోళన, వ్యగ్రత అంతా కాగితాలమీద
పరిశోధనలుగా, ప్రకటనలుగా, ప్రతిజ్ఞలుగా అక్షర రూపం దాలుస్తూ వుంటాయి.
అడవిలోకి రోడ్లు వస్తాయి. వాహనాలు వస్తాయి. గిరిజనాభివృద్ధి సంస్థల భవనాలు
వస్తాయి. ఇదివరకు వచ్చిన పరిశ్రమలవలెనే, ఇదివరకు వచ్చిన భూస్వాములు,
వడ్డీవ్యాపారులవలెనే ఇవన్నీ ఆదివాసులకు మరింత మారుమూల ఇరుల ఇరకాటపు
విసినాటివిలోకి తోసేస్తాయి.

ఇంద్రవెల్లిలో గానీ, భద్రాచలంలో గానీ మూడు శాతం గిరిజనలుకూడ లేరు.
అని తెడ్డూళ్లు ఏరియాలు ఎట్లా అవుతాయి అని ధూర్త అమాయకంగా అడుగుతాడు
అబిడ్స్‌ను ఆక్రమించుకున్న ఎన్టీఆర్. శబరి ఒడిపెట్టిన రేగుపండ్లుతిని పక్కా
దేవాలయం కట్టించుకొని తిష్టవేసినరాముడు భద్రాద్రివాడు ఎట్లా అవుతాడో, చంకన
విసంగం త్రాసు, నెత్తిన గంపలో ఉప్పు, పప్పు, బెల్లం, బియ్యం పెట్టుకుని వచ్చి
తేనె, ఇప్పపూవు, పత్తి, సారపప్పు రుచి మరిగి స్థిరపడిన మార్వాడీలు ఇంద్రవెల్లి
వాళ్ళు ఎట్లా అవుతారో ఎవరు చెప్పాలి? ఎవరు ఈ నేలకు చెందిన వాళ్ళో వాళ్ళు
చెప్పాలి ఎవరు ఎన్టీఆర్ వలెనో, ఎవరు జి.వి సుధాకరరావు వలెనో, ఎవరు మంద
మర్రి మాధవరావు వలెనో, కొల్లి పురుషోత్తమరావు వలెనో ఇతరుల భూమిని,
అడవిని ఆక్రమించుకోలేదో వాళ్ళు చెప్పాలి. నీళ్ళున్న చోటికల్లా పాకివచ్చిన జలగలు
చేపలున్న చోటికల్లా జపంచేస్తూ ఒడ్డున కూర్చున్న కొంగలు, గాలంవేసి కాచుకున్న
వేటగాళ్ళవలె పీల్చిన రక్తం, చిక్కిన ప్రాణి తమ హక్కని భావిస్తే ఎట్లా?

ఆదిలాబాదు, మంచిర్యాలలో సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి. మంచిర్యాల
లోని ఎసిసి సిమెంటు ఫ్యాక్టరీకి పోటీగా బెల్లంపల్లిలో బిర్లాలు ఆసియాలోకల్లా
పెద్ద సిమెంటు ఫ్యాక్టరీ పెట్టడానికి పథకాలు వేస్తున్నారని చెప్పుకుంటున్నారు.
(పాపం ఆయనే నష్టాలు వచ్చి సర్‌సిల్క్ మిల్లు ఐదేళ్ళ క్రితం లాకౌట్ చేస్తే

ఆరువేల ఉద్యోగులు నిరుద్యోగులయ్యారు, కూలివాళ్ళయ్యారు, బిచ్చగాళ్ళయ్యారు. ఎంతమంది ఆత్మహత్యలు చేసుకున్నారో, ఎన్ని జీవితాలు శిథిలమయ్యాయో ఒక్క సామాజికశాస్త్ర జిజ్ఞాసీ పరిశోధించిన దాఖలాలేదు ) కాని ఆదిలాబాదు పేదప్రజలకు నెత్తిమీద నీడలేదు. అడవిలో విరిగిపడిన కొమ్మతో, రాలిపడిన ఆకుతో గుడిసె వేసుకుంటే ఫారెస్టు అధికారులు అడవి నరికారని కేసులు పెడతారు. గుడిసెలు పీకేస్తారు. మంజూరైన ఇళ్ళకోసం ఎంచి కలప తెచ్చుకుంటాం అడవి మనదేకదా అని మట్టి మీద గిరిజనలు కొంచెం చొరవచూపితే పోలీసులు కాల్పులు జరిపి చంపేస్తారు. కట్టుకున్న ఇళ్ళలో నక్సలైట్లకు ఆశ్రయమిచ్చారని ఒరిస్సానుంచి వచ్చిన సామంత గిరిజనుల గూడాలు చింతపల్లిలో తగులబెడతారు.

బెల్లంపల్లి, మందమర్రి, రామకృష్ణాపురం అన్నీ సింగరేణి బొగ్గుబావుల వరుస. అక్కడరగుల్కొనే వెలుగులు కలవారి జీవితాలలో నిజంగా విరిసినసింగరేణి అయితే, అక్కడ తవ్వుకునే కష్టాలు కార్మికుల పాలిటి బొగ్గుబారే. వాళ్ళ బతుకులు మృత్యువు నోరు తెరచినట్లుండే బొగ్గు బావులే.

ఇంక కరువుబారిన కష్టజీవుల బతుకుల్లో ఏముంటుంది పక్షపాతం లేక క్రూర. మూడు సంవత్సరాల క్రితం వచ్చిన భారీ వర్షాలకు జిల్లాలో అన్ని రోడ్లు తెగి పోయాయి. చెరువులు, కుంటలు గండ్లు పడినాయి. అడవి కాచిన వెన్నెల వలె వరదంతా మట్టిపాలయింది రెండు సంవత్సరాలుగా కరువు కరాళనృత్యం చేస్తున్నది అడవిలో గోండులు ఆకులలములు తింటున్నారు. విషముష్టికాయలు తింటున్నారు.

ఈ కరువు చేసుకున్న పాపఫలంకాదు, కర్మకాదు, సహజమైందికాదు. ఇది దోపిడీ వర్గాలు సృష్టించింది అని గ్రహించగానే కరువు దాడులకు పూనుకున్నారు. ఇంద్రవెల్లిలో పోడుచేసుకున్న భూమి పై పట్టాలు కావాలని పట్టుపట్టి ప్రాణాలర్పించి, సాత్నాలలో క్రూరమృగాల బారినుంచే కాకుండ పోలీసుల బారినుంచి కూడ రక్షణ కోసం కంచెలు తవ్వుకొని కుటుంబం పోషించి, సికాస నాయకత్వంలో గోదావరి లోపల బొగ్గు బావుల్లో పెమ్మాన తట్టలు తిరిగేసిన ప్రజలు బండ్లు కట్టుకొని వందల సంఖ్యలో తమ సంపద తమ ఇళ్ళకు తిరిగి తెచ్చుకోడానికి జైపల్‌లోనో, దండెపల్లిలోనో దండుగా కదిలారు జొన్నలు పంచుకున్నారు. అవసరాలు పంచుకున్నారు. ఆకలి కడుపులు వున్నచోట 'బొగ్గ బాగ బెంచిక' గాదెల, గోదాన్ల పని పడతామని చెప్పారు.

ఈ స్పృహకు, ఈ అవగాహనకు, ఈ చైతన్యానికి పునాదిగా ఆదిలాబాదు పీడిత ప్రజలు దశాబ్దంపైగా ఒక మౌలిక పోరాటాన్ని నిర్వహిస్తున్నారు. అదే ఇవ్వాళ దండకారణ్య రైతాంగ పోరాటంలో, ఉత్తర తెలంగాణా రైతాంగపోరాటంలో భాగమైన విప్లవోద్యమం ఈ విప్లవోద్యమనాయకత్వంలోనే 1981లో ఇంద్రవెల్లిలో అప్పటికి తాము పోడుచేసుకొని వ్యవసాయం చేస్తున్న ముప్పై అయిదువేల ఎకరాల భూమి పట్టాలు కావాలని డిమాండు చేసి ఇంద్రవెల్లిని ఫాసిస్టు ప్రభుత్వాలు మరో 'జలియన్‌వాలాబాగ్'గా మారణహోమం చేసినా జంకలేదు. మళ్ళీ ఇవ్వాళ అదే విప్లవోద్యమ నాయకత్వంలో 1980 నుంచి తాము సాగుచేసుకుంటున్న ఎనభై వేల ఎకరాల భూమిపై తమ హక్కు ప్రకటిస్తూ పట్టాలు కావాలని డిమాండు చేస్తున్నారు. 81లో వచ్చిన జనానికి పదిరెట్లుగా లక్ష మందికి పైగా ఇంద్రవెల్లి మృతవీరుల సంస్మరణసభకు ఈ ఏప్రిల్ 20న కదలి వచ్చారు. అడవిమీద, అడవి సంపద మీద, మౌలికంగా భూమిమీద హక్కు ఆదివాసులదని చెప్పడానికి వాళ్ళిప్పుడు రైతుకూలీ సంఘం సభలకు రాడికల్స్ పిలుపుపై వరంగల్‌కైనా వస్తారు. తాముగా మే 20న హైదరాబాదుకైనా వస్తారు.

అడవులు నరుక్కుంటూ దోపిడీ వెళ్ళిన చరిత్ర నిన్నటిదయితే, అడవులు నరుక్కుంటూ ఇవ్వాట్టి కరువు సృష్టించిన దోపిడీ చరిత్ర నిన్నటిదయితే, దోపిడీకి తోడుగా సిఆర్‌పి క్యాంపులు, బూటకపు ఎన్‌కౌంటర్లు, కోంబింగ్ ఆపరేషన్లు, టెర్రరిస్టు చట్టాలు ఇంకా ఇవ్వాల్టికి పచ్చినిజాలయితే ఇంద్రవెల్లి, చింతపల్లి చవిచూపిన ఆదివాసులు నక్సల్బరి, శ్రీకాకుళం చూపిన మార్గంలో మళ్ళీ ఇవ్వాళ లక్ష్యాన్ని పసిగట్టి కదల బారిన అడవులపై శత్రువులపై తమ పోరాటాన్ని ప్రకటిస్తూ ఇంద్రవెల్లికి తరలివచ్చారు. వరంగల్, హైదరాబాదులకేకాదు ఢిల్లీకైనా సరే కదలివెళ్ళడానికి కదన్ శంఖం పూరించడానికి కదం తొక్కుతున్నారు. ఆ యుద్ధం గెలిచిన నాడు, ప్రజాయుద్ధం విజయవంతమైననాడు

సకల సంపదలు కలిగిన దేశం,
మానవ వనరులుగల కష్టజీవులదవుతుంది.

మేడే 90

—సంపాదకుడు

# అమరత్వమా నీకు జోహార్లు!

సంతోష్

వేల పిడికిళ్ళలో పిడిబాకులై
కోట్ల గొంతులై నినదిస్తున్న
ఓ అమరత్వమా!

నీ గుండెల్లో పేలిన డైనమైటు
నిన్ను వేయి ముక్కలు చేసినా
ఒక్కొక్కటే పేర్చుకొని
హిమాలయమంత ఎత్తుకు ఎదిగిన
ఓ అమతత్వమా!

నీపై రాకాసి మూకలు
తెల్లని శాలువా కప్పితే
మురికి పట్టిన మూడురంగుల జెండా నెత్తితే
లక్షల గోండుల పహరాలో
వారి ముఖాన ఉమ్మి వేసిన
ఓ అమరత్వమా !

ఒక చోట నిన్ను కూల్చివేస్తే
శత్రు గుండెల్లో రైళ్ళు పరిగెత్తిస్తూ
వేల చోట్ల
దర్శనమిస్తున్న
ఓ అమరత్వమా !

నీవు ఒలికిన రక్తంతో
గోదావరి ఎరుపెక్కుతోంది
దండకారణ్యం చిగురిస్తోంది
మన్యం మండుతోంది

గమ్యం చేరుకోమని
ముందు బాటలో నిలిచిన
ఓ అమరత్వమా !

నీలో నింపుకున్న శక్తి
నీవు శిలవైనా
ఒక నగరమై వెలిసినా
జన సంద్రానికి వేదికగా
పోరాటానికి స్ఫూర్తిగా నిలిచిన
ఓ అమరత్వమా !

సాగేటి వాగువై
అడవిలో వసంతమై
పరవళ్ళు తొక్కే నదివై
తిరిగే మర చక్రమై
అనంత విశ్వంలో అంతా నీవే
ఓ అమరత్వమా !

నిస్సారమైన ఎడారి బతుకుల్లో
ఇథియోపియా కరువుల్లో
గల్ఫ్ జలాల్లో
బంగ్లా వరదల్లో
ఆండీస్ పర్వతాల్లో
నినదించే నినాదం నీవే
ఓ అమరత్వమా ! నీకు జోహార్లు !!
(ఇంద్రవెల్లి అమరవీరుల స్మృత్యర్థం)

గాథ :

# ప్రారంభం

## గోదావరి

"ఓ....యాఁ .... ఓయాఁ" చేతులాడుస్తూ మంచెమీది వెదురు తడక కిరకిర మంటుండగా ఆగమాగంగా ఎగిరాడు కుర్సింగరాము.

అతన్ని గేలి చేస్తున్నట్లుగా ఎర్రముక్కులు, జల్లితో కలగల చిలుకలు కుర్సింగ రాము కన్నా ఎక్కువలొల్లి చేస్తూ మంచెకు కొద్దిదూరంలో గల పుట్టగడ్డ గుంపుమీద వాలినయ్. కుర్సింగరాం చేతులు తిప్పుతూ మొత్తుకున్నాడు. అయినా చిలుకలు ఖాతరు చెయ్యలేదు. రాళ్లు విసిరాడు. అవిలేచి మరికొంత దూరంలో వాలినయ్. కుర్సింగరాం మంచెడిగి పరిగెత్తాడు. చిలుకలు ఎట్టకేలకు పక్కనేగల సిడాంమాన్కు చేనులో వాలినయ్.

"ఇయ్యాల్లెందుకో మాన్కు కావలిరాంపాయె" ననుకుంటూ అటుకేసి పరుగెత్త బోయేసరికే వాటికవే లేచిపోయినయ్.

గమ్మత్తుగా పైరగాలి తోలుతోంది. పైరగాలికి జొన్నకర్రలు 'గుసాడి' నృత్యం చేస్తున్నట్లుగా ఊగుతున్నాయి. ఆగాలి విసురులో కుర్సింగరాం "రేలారేలా" అంటూ కొండపొడుగు రాగంతీస్తూ కాళ్లెగరేస్తూ గట్టుమీద పరుగెత్తాడు. సమయానికి ఒక్క పాట మతికి రాలేదు. రాము మండిలో ఉన్నప్పుడు కుక్కినపేను. గిపొంటి చేండ్ల కాడనే గొంతెత్తి పాడేది.

"కలన్‌వాడి వాతా వాతా....

జెండా బోతోబోతో ఆతా....

రేలారేలారేలా...."

(కల్లె రాజ్యం దొంగల రాజ్యంవచ్చి జాతిజెండా ఓడిపోయింది)

ఎంతసేపు ఆ రెండు చరణాలే తప్ప పాటముందుకు సాగలేదు.

పడమటిదిక్కు సూర్యుడు అలసిసొలసి విశ్రమించబోతున్నాడు. పడమటి దిక్కు అడవి బందుదాకా విస్తరించి మాంచి జోరుమీదున్న జెగ్గయ్య షావుకారి చేండ్లమీద ఎర్నడాలు మెరుస్తోంది. పక్షుల అరుపులు తగ్గినా జెగ్గయ్య పాలేర్లు ఇంకా అరుస్తూనే ఉన్నారు.

కుర్సింగరాముకు భార్యసీతి జ్ఞాపకం వచ్చింది. సీతి మినుకు (చేపలు) కూర వండిందో లేదో? మినుకు కూరతోపాటు ఎప్పుడో నమలిన మేక చెవులు జ్ఞాపకం

వచ్చి నోట్లో నీళ్ళూరినయ్. సీతితెచ్చేసద్ది జ్ఞాపకం ఆకలిని రేపుతోంది. "శేలా .... శేలా" అనుకుంటూ మంచెకేసి పరుగు తీశాడు.

"రాంరాందాదా మసిఋసీ మీదున్నది పనివరుస" దక్షిణంవేపున గల కొండిస్తె, దంతె తుప్పల్లో నుండి బయటకు వస్తూ పొగాకు లచ్చయ్య.

టక్కున నోరుమూసి "రాంరాందాదా" అన్నాడు కుర్సింగరాం తత్తరపడుతూ- లచ్చయ్య వెంట ఉన్న బక్కపలుచటి వ్యక్తేవరో తెలియక.

"గూడెంలంత మంచేగద-" లచ్చయ్య గోసెతట్టులో చుట్టిన పొగాకు కిందబెడుతూ గోండిభాషలో.

"ఆఁ" అన్నాడు కుర్సింగరాం.

"ఇయ్యేడు పేనంత గొడతె గోనెడు (బస్తా) జొన్నలు రాలేటట్టు లేవుగద దాదా." లచ్చయ్య

"పేన్కు (దేవుని)దయ" అన్నాడు కుర్సింగరాం.

వాళ్ళు గోండీలో మాట్లాడుకుంటున్నారు. కొత్త వ్యక్తికి అర్థంకావడంలేదు.

లచ్చయ్య మాట్లాడుతూనే పొగాకు కాడ ఒకటి తీసి కుర్సింగరాము కిచ్చాడు. అదెంతో పవిత్రమైన దానిలాగా కుర్సింగరాం తీసుకున్నాడు.

"రాత్రికి అట్లరారాదు అందరం నెగడికాడ మాట్లాడుకుందాం" లచ్చయ్య బయలు దేరాడు.

లచ్చయ్య నడికు పొట్టిమనిషి. ముతక ధోవతి, అంగీ - అసిఫాబాదు నుండి రాజోరాదాకా ప్రతిగోండు గూడెం అతనికి పరిచయమే. అతని వెంట వచ్చిన తనికి ఇరువై అయిదు సంవత్సరాల వయస్సుంటుంది. పీక్కుపోయిన దవడలు, చురుకు చూపులు, సన్నగాపీలగా ఉన్న కంకబద్దలాగా సాఫ్‌గా ఉన్నాడు.

"గోండోల్లంత తెలివి తక్కువ మనుషుల నాజన్మల చూడలేదు. అరెబొత్తిగ ఏమి తెలువదు. మైదానం నుంచి వచ్చిన ప్రతి తట్టెర బుట్టెరగాడు షావుకారై అచ్చె నుక దొరయ్యిండు. మరాఠ నుంచివచ్చిన వాళ్ళు హరిజనులే ఎక్కువైన ఈడ కొద్దో గొప్పో భూములు సంపాయించిండ్లు - మరి పోగొట్టుకున్నో దెవడయ్యా అంటే గోండోల్లే -ఇందాకటి రైతును చూస్తివిగదా! అయినె గీ గూడెంలో మా దండి రైతు. గాయిన ఎవుసాయంషూడు - పేనంతగొడతె క్వింటల్ జొన్నలు రాలయి - దానికి జాడునొప్పకొన్నుంచి ఈనెకొవలి. ఆ పాటిపనోనికి దినాం పొద్దున మాపున పెండ్లాం

సద్ది తేవాలె - రెన్నెల్ల ఇద్దరి పనితనం సూడు. గోండోల్ల ఎవుసాయం గట్టుకుత్తైలు తోసినట్టే అనుకో." అచ్చయ్య చెప్పుక పోతున్నాడు.

ఒక్క పలుచటతని పేరు రాఘవులు. అతను అదే ఆలోచిస్తున్నాడు అతను మైదానం ప్రాంతంలో వ్యవసాయం చేసిన రైతు బిడ్డడు.

ఇద్దరు మరికొంత దూరం నడిచేసరికి గునుగు బాగా పెరిగిన అనుప పెరడి వచ్చింది. అనుప తీగలు ఎదుగకుండా కలుపుగడ్డి కప్పేసింది. "కలుపు తీయడం వాళ్లకు తెలియనే తెలియదని, సోమరి పోతులని" అచ్చయ్య చెప్పుతున్నాడు. "అడవిలో ఏమదుపాటుతో బతికిన గోండోల్లు సోమరి పోతులెట్లయురి" అని రాఘవులు ఆలోచిస్తున్నాడు.

రాఘవులుకు కొద్దిదూరంలో జెండా కన్పించింది. ఆదేమిటని అడిగాడు.

"ఓహో అదా రగల్ జెండ, ఎప్పుడో 'గోండ్వానా' రాజ్యాన్ని గోండోల్లే ఏలిండ్లంట. ఆ దర్పానికి సాక్షంగా ప్రతిగూడెంలో అలాంటి జెండా కడుతారు. గోండోల్లు ఉపాసమున్నాతాము రాజుల సట్టపోల్లమే అనుకుంటరు. మూడేండ్లాసె ఈల్లినుట్టు తిర్గబట్టి - అన్ని విన్నట్టే వింటరు. కొట్లాడాలెనంటె సప్పుడు జెయ్యరు." అచ్చయ్య అలిసిపోయినట్లుగా దీర్ఘంగా నిట్టూర్చాడు.

వాళ్లిద్దరి కాళ్ళకింద బండ్లబాటలోని బొడిగరాళ్ళు కర్ కిర్ మంటున్నాయి. అప్పుడే చలి షురువైనట్టున్నది. దూరంగా గూడెంలో నుండి పొగలు లేస్తున్నాయి. కొద్దిగ దూరంలో ఎక్కడో మేకల అరుపులు విన్పించాయి. చేండ్లమీది నుండి కావలి వాళ్ళ కేకలు నీర్సంగా విన్పిస్తున్నాయి.

బండ్లబాట పక్కనే ఎత్తుగడ్డమీద పెద్దకొయ్యకు ఎర్రటిజెండా. దానిమీద నెల వంక - మీదచుక్క "జెండా మాత్రం చాలా బాగున్నదే." అనుకున్నాడు రాఘవులు.

"ఈ వూల్లే గోండోల్లే మెజార్టి - వాళ్ళభాష తెలుస్తది. కొలామోల్ల భాష గొట్టు - వీళ్లకన్నా రాజోర అవలినుంచి వచ్చిన మరాఠ వాళ్ల కొద్దిగ హుశ్యారు. వ్యవసాయం బాగాచేస్తరు. అందరు అండినకాడికి తలాకొంత ముంచినా "షేం రాజులమే" అనుకుంటరు గోండోల్లు." అచ్చయ్య.

"ఇక్కడ ధనికరైతులు, మోతెపరులులేరా?" రాఘవులు.

"అగోసుకల్ల సెంద్రుని తీర్గ కన్పిస్తలేద పెద్ద భవంతి అ షావుకారి

జెగ్గయ్యశి. అయినె ఇక్కడ షావుకారి, దొర అన్నీ - అయినెకు ఆరుగురో ఏడుగురో పాలేర్లు — ఊరోల్లంత ఎట్టి దున్నుతరు - ఇద్దరో ఏమో కొమ్ము పాలుకున్నరు. కొమ్ముపాలంటె ఎరికేనా భర్తతోపాటు భార్య షావుకారింట్లో పనిచెయ్యాలె. ఇక్కడ షావుకార్లంటే కోమట్లుగాదు. షావుకారంటే ఉత్త బేపారం జేసెటోడుగాదు. పైసగల్లోన్ని షావుకారంటరు అన్ని కులాలోల్లున్నరు. జెగ్గయ్యనే తీసుకోరాదు. జెగ్గయ్యకు ముగ్గురు పెండ్లాలు ఒకామె తెనుగామె - మరొకామె మరాటామె. ఇంకొకామె బొందిలామె. రాజపుత్రులంటరు."

ఇంతలోనే ఊళ్లెనుండి నాలుగుమేకలు పట్టుకొని గళ్లలుంగీ కట్టుకున్న కటికాయినె ఎదురయ్యిండు.

"బేరం తక్కువ జేసుకపోతన్నవ్" లచ్చయ్య

"ఏడ పంతులు గోండోల్లు ధర గిట్టనిత్తలేరు. ఎండకాలంలైతే పరుశత్ బరుసుతది." మేకలను జబర్దస్తీగా లాక్కొని కటికాయినె వెళ్ళిపోయాడు.

గోలగోలగా అరుస్తూ, ఊరికేసి మర్రి మర్రి చూస్తూ, గింజుకుంటూ పోతున్న మేకలను చూస్తూ రాఘవులు కడుపుల దేవినట్లై ని చున్నాడు.

"నాకొక్కటే అర్థంకావడంలేదు. చెప్పిన యన్నివింటరు వాడు గుంజుకున్నడు వీడు గుంజుకున్నడని లెక్కలన్నీ చెప్పుకరు. వాళ్ళయి ఒడువని బాధలు చెప్పుతరు. ఒక్కటా? అటుజెంగలాతోళ్ళు, ఇటు షావుకార్లు పీల్చిపిప్పి చేసిండ్లు- అన్ని బరాబరే- అందరు ఒక్కటిగావాలె - సంఘం బెట్టుకోవాలె, కొట్లాడాలెనంటె తెల్ల మొఖాలేసి చూస్తరు. వీళ్ళు కొట్లాడలేదా అంటే - అడవిల బతుకు కొట్లాటలేకుంటె ఎట్ల నడుస్తది? అదివోనియ్యి పందొమ్మిది వందల నలభైలనో ఏమో కొమురం భీం అనే గోండాయినె పన్నెండూళ్ళ బొందిచ్చి నైజాం సర్కారునే సవాలు జేసిండట-ఏగూడెం బొయ్న అయినె ముచ్చెట్లే చెప్పుతరు. ఏమో వీళ్ళు లడాయి చేసిండ్లంటె నమ్మబుద్ద యితలేదు." ఇట్లా లచ్చయ్య బయలు దేరిన దగ్గర్నుండి తన మూడు సంవత్సరాల గిరిజన గూడేల అనుభవసారంగా తెలుసుకున్న విషయాలు రాఘవులుకు చెప్పుతూనే ఉన్నాడు. రాఘవులుకు అందులో కొన్ని విషయాలు తెలుసు. వీళ్ళను ఇంత లోతులోకి తొక్కేసిన శక్తేమిటో అర్థం కావడంలేదు. ఆ అగాథంలో నుండి బయటకు రావడానికి ఏ గడ్డిపోచ కిటుకు దొరకడంలేదు .... అయితే తమకలల మాటేమిటి?

తమ ఆలోచనలకు అర్థమేమిటి? ఏదోవొకటి చెయ్యాలి. ఎక్కడో ఒకచోట మొదలు గావాలి

ఇట్లా ఆలోచించు కుంటూ ఊళ్ళోకి చేరుకునే సరికే "పొగాకు లచ్చయ్య వచ్చాడనే వార్త చుట్టుకపోయి చాలామంది వచ్చారు. అప్పటికి పొద్దుగూకి ఊరికి నాలుగు వైపుల గల అడవి నీడలు ఊరును కప్పేసినట్లుగా చీకటి ముసురుకో సాగింది.

○ ○ ○

పైరగాలి తగ్గి చలిఘరువయ్యింది. సిడాంమాన్కు గుడిసె ముందు పెద్దనెగడి మండుతోంది. రాత్రి కీచురాళ్ళరొద - ఊళ్లో కుక్కలు ఆదేపనిగా మొరుగుతున్నాయి. నెగడు చుట్టు అయిదారుగురు గోండువాళ్ళు కూర్చున్నారు. వాళ్ళకు కొద్దిదూరంలో నలుగురు కొలామ్‌వాళ్ళు కూర్చున్నారు. ఇద్దరు మరాఠ వాళ్ళు ఆ పక్క కూర్చున్నారు.

అక్కడ అన్నివయసుల వాళ్ళున్నారు. అందరి ముఖాలమీద గోరెడుమాంసం లేదు. వాళ్ళకు తమ బతుకుమీద అధికారంలేదు. అదెట్లా గడిస్తే అట్లా బతుకుడే. బతుకును మార్చుకోవచ్చునని వాళ్ళకు తెలియదు. గాలివాటంగా బతుకుడు. కష్టించిన జాగాలో నెత్తురు కలికలి చేసి జొన్నలో, అనుములో, కందులో నువ్వులో చల్లడం. పంట పండుతే - పంటను ఎవరు గుంజుకోకుంటే తినుడు. లేకపోతే షావుకారి జెగ్గయ్య దగ్గరికి పరుగెత్తడం. జెగ్గయ్య ఇచ్చేదెంతో వాళ్ళు తేర్పిందెంతో లెక్కలు తెలియవు ఆప్పాల్లే బతుక వశం కాకపోతే కుండా, గురిగి నెత్తినేసుకొని అడవిలో తట్టుకు పోవడం- అక్కడ జంగల్ నరకడం గుడిసెలు వేసుకోవడం - జంగలాతు వాళ్ళదాడులు. ఊళ్ళకాలబెట్టుడు. ఈ గడబిడలు గడిచి గట్టెక్కేసరికే ఆ గూడానికి మరెవడోవచ్చి జెగ్గయ్యలాగా స్థిరపడుతాడు గోండులు ఇంకా లోతట్టుకు ప్రయాణం.

నెగడు లోతునికి మొద్దులుపెట్టారేమొ అవి చిటపట చిట్లుతున్నాయి. కప్పు కున్న గోనెసంచులు సదురు కుంటున్నారు. అందరిలోకి మాన్కు మరీ విచారంగా కూర్చున్నాడు. అతని కంకలు (ఎడ్లు) అరోజే షావుకారి జెగ్గయ్య బాకీ కింద గుంజుకున్నాడు. ఇప్పటికి తన బాకెంతో మాన్కుకు తెలియదు.

అక్కడికి ఆడవాళ్ళెవరు రాలేదు. పురుషులే ఇంత హీనంగా అడవిలో

చెట్లోలో బతుకు తున్నారంటే - ఆడవాళ్ళకు మరీ బొత్తిగా ఇలాంటి వ్యవహారాలు అసలు తెలియదు.

పొగాకు లచ్చయ్య ఈసారి పొగాకుతోపాటు మరేదో చెప్పుతాను ఉండమంటే ఎవరు ఉండలేదు. హవల్దారు (ఊరి సుంకరి లాంటివాడు) కేసురావు, లచ్చయ్య ఇల్లిల్లు తిరిగి తిరిగి వచ్చారు. వచ్చిన వాళ్ళల్లో సగంమంది పొగాకు ఆశకే వచ్చారు.

"అరె! మనం ఎన్నిదినాలు ఇట్ల నోట్లె నాలిక లేకుంట బతుకుతం భూమిని పణగపన్ని పంటలు దీత్తరు. జెంగల్ల జీవంతోని కొట్లాడుతరు. మనిషిని జూత్తె బయపడుతరు. మీరెంత మందున్నరు. ఇయ్యాల్ల మాన్కు కంకలు జెగ్గయ్య గుంజుకున్నడు. ఏటా పండిన ధాన్నెమంత అప్పుగడు తనే ఉన్నడు భూములు, జాగలు, ఎండి, బంగారం ఓ లెక్క పత్రం లేకుంట జబర్దస్తీగ మన కండ్ల ముంగటనే గుంజుకొని గట్ల పెరిగి పోయిండు. అరె! ఒక్కటిగావాలె - కొట్లాడాలె - మేము మీ ఎంట ఉంటం." లచ్చయ్య గోండు భాషలో ఇట్లా చాలా చెప్పుకొచ్చాడు.

వెంటపడి తరిమిన కుక్కలను తిటుతూ జెగ్గయ్య కొమ్ముపాలేరు బోతడు వచ్చిండు. నెగడి ముందు కర్ర గద్దుప కింద బెట్టుకొని లచ్చయ్యను అతని వెంట వచ్చిన రాఘవులను చూస్తూ నిలుచున్నాడు. అక్కడివాళ్ళందరి ముఖాలల్లో కొద్దిగా భయం.

బయట - మైదాన ప్రాంతాల్లో రైతులు - కూలీలు ఏకమై సంఘాలు బెట్టుకొని కొట్లాడి భూములు, జాగాలు, కూల్లు, పెట్టువళ్ళు, జీతాలు ఎట్లా పెంచుకున్నారో రాఘవులకు చెప్పాలని ఉన్నది కాని తనకు గోండు భాషరాదు. అందరి ముఖాలు చూస్తే తను చెప్పబోయే విషయాలు ఎవరి మెదడుకు ఎక్కే టట్టు కన్పించలేదు.

ఎవరి కడుపులో ఏ ముందో ముఖాలుచూస్తే తెలియడంలేదు. అంటే వీళ్ళ బతుకుగురించి తనకు తెలియదన్నమాట.

కంకల మాట వినగానే గుడిసెలోపల మాన్కు భార్య ఏడ్వసాగింది. మాన్కుముఖంలో కూడా దుఃఖం పొంగుకువచ్చింది మంట వెలుగులో మాన్కు కండ్లవెంట నీళ్ళు కారడం కన్పిస్తోంది.

"చెప్పుండ్లీనయ్యా! రేపు అందరం బోయి జెగ్గయ్య షావుకారిని అడుగుదామా?" లచ్చయ్య.

ఎవరు మాట్లాడలేదు. ఒకరిద్దరు చుట్టలు తాగుతున్నారు. చాలా మంది చీరె పేండ్ల కరుసుడుకు, మంట దగడుకు పండ్లు గిలకరిచి గోక్కుంటున్నారు. పోతడు రాఘవులు ముఖంలోకి చూస్తున్నాడు. ఎప్పుడువచ్చి చేరిండో ఏమో కుర్సింగరాం నెగడు దగ్గర దుమ్ములోనే సొల్లు కారుస్తూ గుర్రు కొడుతున్నాడు.

కొద్దిసేపు నిశబ్దం. కుక్కలు మొరగడం ఆగిపోయింది. దాదాపు ఊదులుకు మగ్గిపోయింది. గుడ్లగూబ ఉండీ ఉండీ గూస్తోంది.

అచ్చయ్య గొంతు బొంగురుబోయేదాకా చెప్పుకొచ్చాడు. ఇట్లాగత మూడేండ్ల నుండి అచ్చయ్య చెప్పుతూనే ఉన్నాడు. అదేమి విచిత్రమో గోండోల్లు ఒక్కచోటన్నా అచ్చయ్య చెప్పినట్టు కొట్లాటకు దిగలేదు.

పోతడు ఓపిక నశించి నిద్రకమ్ముకొచ్చి పెద్దగా ఆవులిస్తూ వెళ్ళిపోయాడు.

"ఏమాయె ఎవరు మాట్లాడరు? నేనన్నదాంట్ల తప్పున్నదా? దినాం సచ్చే బదులు కొట్లాడుదాం - మాన్కు కంకలు లేకపోతే ఎట్ల బతుకుతడు" అచ్చయ్య.

"జొ...." ఎవరో ఆవులించి.

"ఏంది జొ - " అచ్చయ్య.

"మాన్కు సంగతే."

"మరి మాన్కు కంకలు ఎట్లత్తయి?"

ఇంకొకటితను మాట్లాడలేదు.

"మీ కొమురం భీం కొట్లాకి ఊళ్ళు పొందిచ్చిడంటరుగదా?"

"జొ...."

"మీరుగూడ కొట్లాడ్తె".

"గదే తెలుస్తలేదు. జెగ్గయ్య ఊకుంటడా? చియ్యచియ్య కొయ్యడా?" ఒక ముసలి.

"ఇప్పుడు మాత్రం బతకనిస్తున్నడా? అందరు ఒక్క మాట మీద నిలుసుంటె ఏమైతది - సింగీ పిరికి జూసె సకులం గుంజుకుంటండు."

"జొ - నాదగ్గెర నాలుగు గోనెల (బస్తాలు) కందులు — ఎండికడియాలు"

"నాదగ్గెర మూడు గోనెల నువ్వులు."

"నాకాడ నాలుగు మేకలు, బంగారు."

"నాయి మూడు దూడలు, సెలుక."

ఇట్లా అందరు చెప్పుకొచ్చారు. ఏమి చెయ్యాలో తోచక రాఘవులు జేబులో నుండి కాయిదం తీసి రాసుకో సాగిండు. లెక్కలు మళ్ళీమళ్ళీ జ్ఞాపకం తెచ్చుకొని చెప్పుతున్నారు.

అఖరుకు తేలిందేమిలేదు. లెక్కలు బరాబరే "గదేతెలు స్తలేదు" బరాబరే. కొంతమంది లేచి వెళ్ళిపోయారు. కొంతమంది ఆ నెగడి ముందే పడుకున్నారు.

నెగడి ముందు నిదురరాక దిమ్మెరపోయి - చలిలో గడ్డకట్టుక పోయినట్లు - అనలు మొత్తం బతుకు వ్యాపకమంతా ఎడ్లతోనే పోయినట్లు - అవయవాలు తెగి పోయి మొండెం మాత్రమే మిగిలినట్లు మాన్కు కూర్చున్నాడు.

నేల మీద విసుర్రాయి పాతివిసిరిన గడుక మట్టి, పేడవాసన వేసి రాఘవులు సరీగ తినలేదు. కడుపులో ఆకలిమంట నెగడు ముందట మంట - మెదట్లో ఏదో చెయ్యాలనే మంట - పైన చుక్కల ఆకాశం, తనెప్పుడు వినని అడివిపల్లెలో రాత్రి చప్పుడు. ఉండీ ఉండీ గలగలలాడుతూ పైరగాలి విసురు — అప్పుడప్పుడు మొరిగే కుక్కలు.

"వీళ్ళు ఇన్నిరకాలుగా దోపిడికి గురౌతూ కూడా ఎట్లబతుకు తున్నారు? మరి ఈ జాతివాళ్ళు తిరుగుబాట్లు చెయ్యలేదా అంటే నైజాముకు వ్యతిరేకంగా కొమురం భీం తిరుగుబాటు చేసినట్లు చెప్పుతున్నారు. ఇనొంటోల్లను కూడగట్టిండంటే లావు తెలివి గల్లోడే - వీళ్ళ కిటుకు తెలిసినోడై ఉండాలె - భారతదేశంలో సంతాలులు తాతా త్యలు, ముండాలు ఇంగ్లీషు వాళ్ళను గడగడలాడించిరి. మన్యం అల్లూరి సీతారామా రాజు, శ్రీకాకుళం సవరలు; వెంపటాపు సత్యం రాసిన పుస్తకాలు ఏమైనా ఉన్నయో? వీళ్ళకు చెప్పేమాటలు బాగా అర్థమైతలేనట్టున్నయి. తాపతాపకు "గదే తెలు స్తలేదు అంటండ్లంటే చేసి చూయించాలెనన్నమాట...." రాఘవులుకు ఏదో చిక్కుముడి విడిపోయినట్టనిపించింది.

రాఘవులు మాన్కు దగ్గరికి జరిగి భుజం మీద చెయ్యివేసి "నీ ఎడ్లు నీకు వస్తయి" అని చెప్పాలను కున్నాడు. కాని తనకు భాషరాదు. మాన్కుకు ఏమర్థ మయ్యిందో రాఘవులు మీద పడి ఏడ్చాడు.

అక్కడకందీన ముందు జెగ్గయ్యకూర్చున్నాడు. పోతడు చెప్పిన విషయాలు నమ్మాలా వద్దా తెలియడం లేదు. అక్కడక్కడ జర్గిన జరుగుతున్న విషయాలు కర్ణాకర్ణిగా వింటూనే ఉన్నాడు. ఎవని మాట వానికి గావాలె ఎవని జాగ్రత్త వాని

ఉండాలె— "వీళ్ళు వాళ్ళేనా? వాళ్ళ గురించి కూడా జెగ్గయ్యకు పూర్తిగా తెలియదు. తెలిసిన కాడికి మాత్రం - వీళ్ళు బంకపీసుగాళ్ళు పట్టిదంటే ఒదులరు. అందా తీర్గ ఏదో ఇంత పారేత్తమంటె వినరు. జన్నారంపైడు జమీందారు రావుసాబ్ గతే పయ్యింది. తిర్యాని దగ్గెరి పెర్కపల్లె భూమి కొట్లాట భూమయ్య కిట్టగౌడులంట ఆఖరుకు గిన్నెధారి లచ్చుపటేల్ ను ఖతమేసేసిరి. అ, మనకెందుకీ కిరికిరి. ముల్లును ముల్లుతోనే తీసుకుంటె పాయె — వీళ్ళు ఊకె ఊళ్ళె ఉండచ్చిండ్లా? పొగాకొన్ని నాదే రానియ్యక పోనుంటి -" ఇట్లా తనకు తానే సమాధానం చెప్పుకొని పడుకున్నాడు.

○ ○ ○

పొద్దటి ఎండపొడ అడవి మీదుగా లేచి గూడెంమీద పరుచుకుంటోంది. నెగల్లో పెట్టిన మట్టికుండలోని వేడినీళ్ళతో లచ్చయ్య, రాఘవులు ముఖాలు కడుక్కున్నారు. మాన్కు పిల్లి బట్టిన కోడిపిల్ల తీర్గ కూచ్చున్నాడు మాన్కు పెండ్లాం డికాషన్ చేసి పోసింది. ఆ డికాషన్ కే మాన్కు కొడుకు బరిబాత రాఘవులు పక్కన కూచ్చుండి గుటికిల్లు మింగుతున్నాడు. అది చూసి రాఘవులు తనకిచ్చిన టీ లో కొంత పిల్లవాడికి పోశాడు.

"నాకే మనిపిస్తున్నదంటే వీల్లకు మాటలకన్నా చేతలుగావాలె — చేతలు చేసుకుంట మాటలు చెప్పాలె - రాత్రి అందరి ముఖాలమీదబట్టి అర్థమయినదేమంటే- వాళ్ళు నిలువునా దోపిడి చేయబడుతున్నారు. అది ఎట్లా జరుగుతున్నదో? ఎవరు చేస్తున్నారో మనకన్నా వారికే ఎక్కువ తెలుసు. అయితే ఏం చేయాలె? కొట్లాడ్తె తప్ప ఏదీరాదని తెలుసు - కాని ఎట్లాకొట్లాడాలె ? ఎవరు కొట్లాడాలె? ఖానూన్లు, డబ్బు, దస్కం ఉన్నవాళ్ళతో కొట్లాడి గెలవగలమా? ఇలాంటివి వారికి తెలియదు. రాత్రి నాకు ఎప్పుడో చదివిన అమరవీరుల చరిత్ర జ్ఞాపకం వచ్చింది. శ్రీకాకుళంలో వాడిపేరు గుర్తు రావడంలేదు. వాడొక క్రూరుడైన భూస్వామి - వాన్ని చూస్తే గిరిజనులకు భయం. మన సత్యం ఒకమారు గిరిజనులతో మంచం మీద

కూర్చుండి ఏదో మాట్లాడుతున్న సమయంలో ఆ భూస్వామి వచ్చాడట. గిరిజనులు తత్తర బిత్తరయ్యారు. సత్యం మంచం మీదినుండి లేవలేదు. భూస్వామి "నాముందే మంచం మీద కూర్చున్న నీకెన్ని గుండెలురా?" అన్నాడట. సత్యం అంతకన్న కోపంగా "నాకున్నది ఒక్కటే గుండె - నెనెవలో ఎరికేనా" అన్నాడట - భూస్వామి అక్కడినుండి తోకముడిచాడట - ఆ సంఘటన ఆ ప్రాంతంలో పెద్ద సంచలనం రేపింది. భూస్వామి నెదిరించి బతికి ఉన్న మొనగాన్ని చూశారు. చూడడమేకాదు తమకు అండగా ఉన్నాడు."

"అయితే పీడిపని పడుతాం. మాన్కు ఎడ్లు ఇస్తడా లేదా ? అని అడుగుదామా?" లచ్చయ్య.

"నాకదే అనిపిస్తంది. నాకన్నా మువ్వే వెళ్ళడం మంచిది. నీవంటెనే ఇక్కడి వాళ్ళకు తెలుస్తది. షావుకార్లకు ఇప్పటికే మనం తిరుగుతున్నామని తెలిసుండాలె. మనది న్యాయమైన మార్గం - మంత్రాలకు చింతకాయలు రాలయి. వాడియ్యకపోతే మళ్ళీ ఆలోచించుకొని ఏదన్నాచేద్దాం." రాఘవులు.

మాన్కుకు వాళ్ళేమి మాట్లాడుకుంటున్నారో సరిగా అర్థం కాలేదు మొత్తానికి తన ఎడ్ల విషయమేనని అర్థమయ్యింది.

లచ్చయ్య యమ ధైర్యంగా నడుస్తున్నాడు. అతనికి గోండోల్లకు తల బద్దలు కొట్టుకొని చెప్పడంకన్నా ఈపనే బావున్నట్టనిపించింది. "ఎందుకియ్యడు వాని తాత యిస్తడు." అనుకున్నాడు. ఇంకోవేపు ఇంతచిన్న విషయం తనకు ముందే ఎందుకు తట్టలేదా అనుకున్నాడు. దేనికైనా సమయం, సందర్భం కావాలెననుకున్నాడు.

జగ్గయ్య ఇంటినానుకొని దాదాపు రెండెకరాల పెరడి ఉన్నది. అందులోనే అతని పశువుల పాకలతోసహా ఉన్నాయి. పెరడి చుట్టు నారేప, నల్లరేణు చెక్కలు పాతి ఉన్నాయి. అవి ఎప్పుడు నాటారోగాని వానల్లో తడిసి ఎండకెండి తుప్పబట్టిన ఇనుపకొయ్యల్లాగా కనిపిస్తున్నాయి.

జెగ్గయ్య దుకాణం తెరిచే ఉన్నది. దుకాణం వెనుక భాగంలో కుమ్మరిగూనె భవంతులున్నాయి. దుకాణం మాత్రం పామునోరులా తెరుచుకొని ఉన్నది. దుకాణం ముందు చింకి గుడ్డల స్త్రీ పురుషులు ఆయిదారుగురున్నారు. దుకాణంలో పోరడు ఏదో సదురుతున్నాడు.

"మీ షావుకారేడి?" అచ్చయ్య జబర్దస్తీగా అడిగాడు ఇట్లోకి వినిపించాలనే.

పోతడు ఆ గొంతుకు ఆశ్చర్యపోతూ పక్కనే గల మూలమలుపు దగ్గర వేపచెట్టుకేసి వేలు చూపించాడు.

అచ్చయ్య అటీటు చూడలేదుగాని దుకాణానికి సుమారు ఇరవై గజాల దూరంలో వేపచెట్టుకింద ఎద్దుకు కొలాం ముసలివాడొకడు కొనపులతో వాతలు పెడుతుంటే షావుకారు అక్కడ నిలబడ్డాడు. ఇంకా నలుగురు రైతులు ఎద్దు కొమ్ములు తోక పట్టుకున్నారు. పిడకల కుంపటి దగ్గర ఒకడు చేటతో విసురుతున్నాడు.

షావుకారి అచ్చయ్యరావడం చూశాడు అతను అడిగినమాట విన్నాడు.

"రమ్మనుపో-" ఇంకాగట్టిగా.

పోతడు బెదిరిపోయి జెగ్గయ్య దగ్గరికి పరుగెత్తాడు. వాడు దూరంగా నిలబడి ఏదో గుసగుస లాడాడు. జెగ్గయ్య పోతనికి జవాబు చెప్పకుండా కొలాం వైద్యునికేదో పురమాయిస్తున్నాడు.

పోతడు తిరిగివచ్చాడు. ఇదంతా అచ్చయ్య చూస్తూనే ఉన్నాడు. అసహనం పెరిగింది. దుకాణంలోనికి జొరబడి "కుర్చీతేపో" గద్దించాడు.

ఆ గొంతుకు పోతడు గజగజవణికాడు.

చూరుకింద కూర్చున్న ఒకనికి కూడా భయంవేసి ఈ వింత గూడెంలో చెప్పటానికి పరుగెత్తాడు.

పోతడు తెచ్చేసిన చెక్కకుర్చీలో అచ్చయ్య కాలుమీద కాలేసుకొని ఠీవిగా కూర్చున్నాడు.

ఎద్దుకు వాతలు పెట్టేవాళ్ళు ఈ వింతకు తలలెత్తి చూశారు. అక్కడ విచిత్రంగా యుద్ధవాతావరణం నెలకొన్నట్లున్నది నిలబడ్డవాళ్లు గుడ్లప్పగించి చూస్తున్నారు

జెగ్గయ్యకు కొత్తగా వింతగానే తోచింది. జెగ్గయ్య దుకాణం దగ్గరికి వచ్చాడు నుదుటిమీద కుంకుంబొట్టు-తెల్లటి ధోవతి లుంగీలాగ చుట్టుకున్నాడు. అప్పుడే స్నానం చేసినట్లున్నాడు. జగ్గయ్య అచ్చయ్య ఉనికి పట్టనట్లు ఊదు బత్తీలు ముట్టించి గల్లా పెట్టెకు దేవుని పటాలకు పొగ చూయించాడు.

అచ్చయ్యకు ఎట్లా ప్రారంభించాలో తెలియలేదు." నీదగ్గర సిగరెట్లున్నయా" అన్నాడు.

జెగ్గయ్య కండ్లతోనే పోతన్ని పిలిచి సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె ఇచ్చాడు. లచ్చయ్య సిగరెట్టు ముట్టిచ్చి ముక్కుల్లో పొగ వదులుతుండగానే. "పొగాకు బేపారం ఎట్లనడుస్తుంది?" పరామర్శ గొంతుతో జెగ్గయ్య,

"నేను బేపారం కోసంరాలేదు" లచ్చయ్య.

జెగ్గయ్య మాట్లాడలేదు. బయట నిలబడిన గోండోల్లు లేకపోతే బాపుండును ఎద్దుకువాతలు బెట్టేవాళ్ళు ఇటే చూస్తున్నారు.

"నేను ఎందుకొచ్చినో ఎరికేనా?"

"చెప్పనిది ఎట్లా తెలువాలె?"

"నేనెవలో ఎరికేనా!"

"పొగాకు లచ్చయ్య........"

"కాదు...." లచ్చయ్య తానెవరో చెప్పాడు.

జెగ్గయ్య ఆశ్చర్యపడ్డట్టు కన్పించలేదు. ఔనా కాదా అన్నది ఔనని రూఢి అయ్యింది. అయితే ఏమిటన్నట్లు ముఖం పెట్టాడు.

"మా పార్టీ అంటే ఎరికేకదా!"

జెగ్గయ్య మాట్లాడలేదు.

లచ్చయ్య ఇప్పటిదాకా మాట్లాడిన గొంతును స్థిరపరిచి "నువ్వు సిడాం మాన్కు ఎడ్లు గుంజుకున్నవటగదా!"

"బాకీ కింద జమకట్టుకున్న."

"మీ బాకీలేమిటో మీరు గోండోల్ల, కొలామ్‌ల ఎట్లాదోసుకొని బుడ్డపంచె పెయ్యి మీదేసుకొని ఎంతబాగా సంపాదించిండ్లో లెక్కలు నీకన్నా నేను బాగ చెప్పగలను. నేను ఈ గూడాలు జంగల్లబడి ఎందుకు తిర్గుతున్ననో ఎరికేనా? మీ పాపాల లెక్కలు తీయ్యడానికే-షంకర మాటలు విడిచిపెట్టి మాన్కు ఎడ్లను మాన్కుకు ఇస్తవా? లేదా?" లచ్చయ్య గర్జిస్తూ.

జెగ్గయ్య రెండు నిమిషాలు మాట్లాడలేదు. లచ్చయ్యను అంచనా కట్టడానికి ప్రయత్నం చేశాడు. మనిషి ఎంతకైనా తెగించిన వానిలాగే కన్పిస్తున్నాడు.

"ఇయ్యకపోతే ఏంచేస్తనని?" లచ్చయ్య విసురుగా కుర్చీమీది నుంచిలేచి బలసిన అగ్గిపెట్టెగీకి" ఇగో ఈ మంటబెట్టి నీ వంతుల కాల్చిపారేస్త. విన్నెక్కడనే గొంతిక వినుకుతే ఏంజేస్తవ్? ఈలవేసి నీ ఇంట్ల సామానంత గోండోల్లకు పంచుత.

ఎండీ బంగారం, ధాన్యం అప్పుకాయితాలు ఇంటిముందు కుప్పబోసి కాలబెడుత" అచ్చయ్య ఏమాత్రం తొట్రుపాటు లేకుండా నిదానంగానే చెప్పాడు.

జగ్గయ్యకు కోపం బుసబుస పొంగింది. అతిప్రయత్నం మీద అనుచుకున్నాడు.

"సరే నీమాట మీద ఎడ్లు ఒదులుత. నాబాకీ ఎట్ల ఇప్పిస్తవో" అంటూ పోతన్ని ఎడ్లను తెచ్చియ్యమన్నాడు.

అచ్చయ్యకు నమ్మశక్యంకాలేదు. ఇంత సులువుగా సమస్య పరిష్కారం కాగలదని అతను ఊహించలేదు. ఆషాక్‌నుంచి తేరుకొని వీధిలో కొచ్చి నిలబడే సరికే పోతడు ఎడ్లను తీసుకవచ్చాడు.

ఎద్దుకు కొనుపుల వైద్యం చేస్తున్నవాళ్ళు, దుకాణంకు వచ్చిన వాళ్ళు అచ్చయ్య చుట్టు మూగారు.

ఆవార్త ఎండకాలం అడవిలో ఎండుటాకుల్లో పడ్డ నిప్పురవ్వలాగా పాకి ఎలుగడిలా గూడెమంతా వ్యాపించింది.

ఎడ్లను పట్టుకున్న పోతడు ఎడ్లను అచ్చయ్య కివ్వకుండా మాన్కు ఇంటికేసి తోలుకపోసాగాడు. అచ్చయ్య వాటి వెనుక నడుస్తున్నాడు పోతడు మాటకు మాట పొంకన లేకుండా తను విన్నది కన్నది చిలువలు పలువలు చేసి చెప్పుతూ పోతున్నాడు.

ఊళ్ళో చిన్నాపెద్దా, ముసలి ముతకా భేదం లేకుండా అచ్చయ్య పక్కన చేరారు.

ఇప్పుడు అచ్చయ్య వాళ్ళకు పొగాకు అచ్చయ్యలాగా కనిపించడంలేదు. జగ్గయ్య షావుకారిని ఎదిరించిన అచ్చయ్య భీముదేవరంత బలంగల అచ్చయ్య. అప్పటికప్పుడే అది ఊరేగింపయ్యింది

సాయంత్రమయ్యేసరికి ఆ చుట్టుపక్కల గల జమ్మల్‌ధరి, మాలిని, బరంజిగూడ, వెల్గి, సామల, ఖేడ్‌గాం, మారేపల్లి గూడాలన్నీ ఆ వార్త చుట్టి వచ్చింది. పొగాకు పంతులు పొరకల సారయ్యింది. ఆయన కాలినడకన కాదు పులిమీద వస్తాడు. ఎంతటివాడైనా మొనగాడైనా ఎదురు నిలువ వశంగాదు.

వెండీ, బంగారం, పశువులు, భూములు షావుకార్లు గుంజుకున్నవన్నీ వాపసు యిప్పిస్తున్నారు. తమ తమ వస్తువులు పోయినవాళ్ళు పొరకల సార్లకోసం పరుగులు తీశారు.

అచ్యుతు, రాఘవులు పోరకల సొర్లయి చాలా గూడాలు తిరిగారు. పందులు, మేలా, పోయిన వస్తువుల జాబితాలు రాసుకున్నారు.

"చుట్టుపక్కల అందరి వస్తువులు గుంజుకొని వాంకిడిలో వ్యాపారం చేస్తున్న షావుకార్ల దగ్గరినుండి ఎవరి వస్తువులు వారు వాపసు తీసుకోవడానికి అంగడి రోజున అందరు వాంకిడికి రావాల్సిందిగా" పెద్ద ప్రచారం జరిగిపోయింది.

0 0 0 0

అడవి కడుపులో నుండి సూర్యుడు ఇంకా వాంకిడి మీదికి పూర్తిగా రానే లేదు అంగట్లో షావుకార్లింకా సరుకులు సదురుకోనేలేదు. వాంకిడికేసి వచ్చే అడవి దారుల మీద చీమల బారుల్లాగా ఆదివాసి జనం రాసాగారు.

గణపతిసేఠ్ చంద్రపూర్ వెళ్ళే కంకరరోడ్డు పక్కనే గల జిన్నింగ్ మిల్లు గేటుముందు నిలుచున్నాడు.

"ఇప్పుడేం పండుగ రోజులు కాదు. జొన్నపంట ఇంకా చేతికి రానేలేదు. ఇంతమంది అంగడికి ఎందుకు వస్తున్నట్లు?" గణపతిసేఠ్ ముఖం ప్రశ్నార్థకంగా ఉండగానే ఆదివాసుల కాళ్ళ దుమ్ము మేఘాలు వాంకిడిని కమ్మేశాయి. గోండు, కొలామ్, పరధాను, లంబాడా, మరాఠవాళ్ళు వందలు వేలయ్యారు. వాంకిడి రోడ్లన్నీ రెమట చుట్టల కంపుతో అరుపులతో నిండి పోయాయి.

ఆ మందిలో సీతి కొడుకులిసి పోగలదని కుర్సంగరాం సీత చెయ్యిని చంకలో ఇరికించుకొని తిరుగుతున్నాడు

"నాకాళ్ళ కడాల్ గణపతిసేఠ్ దగ్గర కుదువపెట్టి డబ్బే తీసుకునే. అవి ఇప్పిస్తరంట" సీతి గుసగుసగా మొగనికి చెప్పింది

"పోరకల సొర్లంటే మకాకా- నిస్తోంది అందరి సొమ్ములు (నగలు) ఇప్పిస్తరు. వాళ్ళు వస్తెనే షావుకార్లు గజగజ వనికిపోయి యిస్తరు ఎరికేనా మనూరి షావుకారి పెద్దపులిసొంటోడు పిల్లికాలేదా?"

"ఏమో సొర్లు వస్తరో రారో? ఇంతమందిలో మనకు కలుస్తరో లేదో?"

"వాళ్ళు లెక్క రాసుకున్నరు. వాళ్ళ కన్నిమతికుంటయి మనయిమనకిస్తరు"

"ఒక్కడి నెత్తిన దమ్మిడిలేదు. వీళ్ళు అంగడికి సరుకులు కొనడానికి వచ్చిరా? దోసుకపోనా?" గణపతిసేఠ్ ముఖం మీద చెమట తుడుచుకున్నాడు.

గోండువాళ్ళు గుసగుసలాడుతున్నారు. వానకాలం తొలి చినుకు పడగానే

పుట్టిన కొమ్ములతో చిమ్ముతూ పరుగులు దీసే ఎడ్లలాగా వాంకిడలతాకలె దిరుగుతున్నారు. కళ్ళతోనే వెతుకుతున్నారు. మరాఠ, లంబాడోళ్ళు చాలామంది ఏం జరుగుతుందో చూద్దామని వచ్చారు.

రాఘవులు, అచ్చయ్య ఎవరికి కన్పించలేదు

"వాళ్ళు పులిమీద వస్తున్నారట" కాదు సార్లు గొంగడి కోలాటవేసుకొని మారు వేషాలతోని వచ్చిండ్లట. అదిగో జన్‌గాం (ఆసిఫాబాదు) రోడుమీద ఉన్న రంజే కాడ సేట్ల దుకాణాల దగ్గర ఉన్నరట" ఇట్లా రకరకాల పుకార్లు వ్యాపించాయి.

గొంగడి కోలాటమోల్ల ముఖాలు చూస్తూ జనం అక్కడిక్కడికి తొక్కిసలాడుతున్నారు. అప్పటికే ఆ చిన్న ఊళ్ళో జనం పదివేలు దాటిపోయారు

గణపతిసేఠ్ "గోండోల్లు వాంకిడిని దోచేటందుకు వచ్చిండ్లు" వణికే గొంతుతో ఆసిఫాబాదు పోలీసులకు ఫోన్‌చేసి చెప్పాడు. అతను జిన్నింగ్ మిల్లు నుండి రోడ్డు మీదికి వచ్చాడు.

"ఎవరి నగలు వాళ్ళకు పౌరకలసార్లు పంచుతన్నరట" అన్న పుకారు వ్యాపించి జనం షావుకార్ల ఇండ్లకేసి పరుగెత్తారు. అంతమంది పోగయ్యేసరికి కంతదళ్ళు కూలిపోయినయ్. ఆ వాడకున్న ఎనిమిది షావుకారిండ్ల ముందు తొక్కిసలాట ఎక్కువయ్యింది. ముందున్న వాళ్ళకుమాత్రమే అందుతున్నాయి నగలని వెనుక వాళ్ళుతలిచారు. పౌరకలసార్లు వెనుక వాళ్ళల్లో ఉన్నారేమోనని ముందు వాళ్ళనుకున్నారు.

తొక్కిసలాటలో షావుకారిండ్లముందు పందిళ్ళు విరిగాయి. గూనపెంకలు కూలినయ్. జనం లోపలికి జొరబడ్డారు. బీడీలు, బెల్లం, ఉప్పు, మిరపకాయలు, బియ్యం, పప్పు, నబ్బులు, బట్టలు అఖరుకు వెండి, బంగారం ఏది దొరికితే అది తీసుకుంటున్నారు. వెనుక ఉండిపోయినవాళ్ళు ముందుకుపోలేక పెద్ద పెట్టున అరుస్తున్నరు.

అప్పు కాయిదాలు, ఖాతా పుస్తకాలు, కనిపించిన కాగితాన్నల్లా చింపిపోగులు పెట్టి నిప్పుపెట్టారు.

అప్పుడు రెండు వ్యాన్ల నిండా పోలీసులు వచ్చారని గుప్పుమంది. జనం ఎట్లా వచ్చిన వాళ్ళు అట్లాగే వాంకిడి నుండి అడవులకు చెన్లు చెలుకల మీదుగా పరుగెత్తారు.

అప్పుడు పట్టపగలయ్యింది.

(కథాకాలం : 1979 ఫిబ్రవరి)

# బిర్లామందిర్

చందు

ఆ రోజు ఆదివారం, రోజువారీ రొటీన్ జీవితం ఉరుకులు పరుగుల మధ్య ఏ ఆలోచనలు చుట్టుముట్టకుండా మిగతా ఆరు రోజులు పరుగెత్తుతాయి కాని ఆదివారం కనిపించని అసంతృప్తుల నీలి నీడలు తచ్చాడుతాయి. స్పష్టంగాని ప్రశ్నలు వెంటాడుతాయి. అందరికీ ఏమోగాని ఆదివారం మునిమాపు పడుకొని లేచినట్లుగా బద్ధకంగా గ్లూమీగా ఉంటుంది. మా ఆవిడకు మిగతారోజుల్లో మా అందరితోపాటే హడావిడి ఈ రోజు మా ఇద్దరు పిల్లలు, నేను ఇంట్లోనే ఉండడంతో అదనపు పనులు ఇలాంటి గ్లూమీ ఆదివారం తప్పించు కోవడానికి చేసే ప్రయత్నాలు నెలకో మూడు మాత్రమే సాధ్యమౌతాయి.

గత రెండు వారాలుగా ఇల్లువదిలి ఎటు కదలకపోవడం వల్ల పిల్లలకు మరీ ముఖ్యంగా మా ఆవిడకు కొంత బోరుగా ఉందేమొ ఈ రోజు ఏదన్నా ప్రోగ్రాం పెట్టుకుందామని నిర్ణయించారు. అయితే ఏ ప్రోగ్రాం పెట్టుకుందామన్న విషయంలో కొంత తర్జన భర్జన జరిగిన తర్వాత పిల్లలు మా ఆవిడ ఆరోజు సాయంత్రం బిర్లా మందిర్ ను దర్శించి వెంకటేశ్వరస్వామిని మొక్కుకుందామని తీర్మానించారు. వాస్తవానికి నేను హైద్రాబాదు ఉద్యోగరీత్యా వచ్చి అప్పటికే రెండు సంవత్సరాలు దాటిపోయాయి. మేము ఉండేదేమో మూసాపేటలో, నాకు అక్కడ దగ్గరగా ఉండే ఫ్యాక్టరీలో ఓ చిన్న పాటి సూపర్ వైజరు ఉద్యోగం. నేను పాలిటెక్నిక్ చేసిన పది సంవత్సరాల తర్వాత చిన్న పెద్ద ఉద్యోగాలు, అక్కడక్కడ పర్మినెంటు కాని పనులు చేశాను. కొంత వరకు పనిచేసిన కాడ పరిస్థితులు, జీతం నచ్చక మరికొన్ని చోట్ల టెంపరరీ ఉద్యోగాల కాలపరిమితి తీరిపోయి తీసేయగా మళ్ళీ మళ్ళీ నిరుద్యోగినై చివరికి క్రింద మీద పడి ఇప్పుడు చేస్తున్న ఫ్యాక్టరీలోకి వచ్చిపడ్డాను.

రెండు గదుల కిరాయి కొంప. ఉన్నంతలో గుట్టుగా సంసారం సాగించే ఇల్లాలు. మోపెడు పుస్తకాలతో చిలుక పలుకుల్లా వచ్చీరాని ఇంగ్లీషు కాన్వెంటులో చదివే పిల్లలు బొటాబొటిగా అవసరాలకు సరిపోతున్న జీతం. ఈ రెండేళ్ళ కాలములో దాచుకోగలిగింది ఏమిలేకున్నా ఈ మాత్రం బ్రతుకు తెరువు ఎందరికుందని ఆలోచించినప్పుడు మేము సుఖంగా బ్రతుకుతున్నామనే నాకు నేను పదే పదే సర్ది చెప్పుకుంటుంటాను.

మధ్యాహ్నాల వరకు ఇంట్లో మా ఆవిడకు ఇంటిపని వంటపని, పిల్లలబట్టలు ఉతకడం, వాళ్ళకు తలంటి స్నానం చేయించటం, ఫోంచేయటం అన్నీ అయిపోయి నవి. పిల్లలు పెండింగు పని హోంవర్క్ కూడా పూర్తి చేసుకున్నారు. ఎలాగు సాయంత్రం బిర్లామందిర్‌కు పోదామని నిర్ణయించుకున్నాం కాబట్టి అంతవరదాక కొస్త విశ్రాంతి తీసుకుంటేసే బాగుంటుందనుకొని నిదురకు ఉపక్రమిస్తుంటే మా చిన్న బాబు దగ్గరికి వచ్చి "నాన్న నాకు ఇవ్వాల క్రికెటుబ్యాటు కొనియ్యాలి తప్పకుండా" అంటూ గోముగా మారం చేసిండు "క్రికెటు బ్యాటు పొడుగు లేవు నీకెందుకురా" అన్నాను. వాడు అదేమి పట్టించుకోకుండా "నాక్కావాలి" అంటూ పట్టి పట్టి కూని రాగాలు మొదలు చేశాడు

ఇక వాన్ని ఎలా సముదాయించాలో అర్థంకాని స్థితిలో మా ఆవిడ వాన్ని సంకన ఎత్తుకొని "సరె లేరా వచ్చేటప్పుడు అలాగే కొనిస్తాం" అంటూ తీసుకు వెళ్ళింది. నేను మెల్లగా నిదురలోకి జారుకున్నాను.

సాయంత్రం నేను నిదరలేచేసరికి పిల్లలు మా ఆవిడ తయారై బిర్లా మందిర్ పోవటానికి సిద్ధంగా ఉన్నారు. నేను లేచి ముఖం కడుక్కొని బట్టలు మార్చుకొని మరోపావుగంటలో తయారై, అందరం బయలు దేరాము.

సాయంత్రం ఆదివారపు సందడిలో హైద్రాబాద్ సిటిబస్సులో మేం నలుగురం ఎక్కి గంట సేపు ప్రయాణం చేసేసరికి చమటతో తడిసి బట్టలు నలిగి పోయి, ఊపిరి సలుపకుండా అయిపోయి, బస్సుదిగేసరికి చల్లగాలి మెల్లగా తాకి పోయిన ఊపిరి మళ్ళీ వచ్చినట్టుగా అనిపించింది.

ఉరుకులు పరుగులతో అనంతమైన జనప్రవాహం పరస్పర విరుద్ధమైన పెక్కు జీవితాలకు నిలయం. ఆకాశ హర్మ్యాలకు పేద పూరిల్లకు స్థావరం ఈ నగరం. అందమైన మెర్క్యూరీ దీపాల కాంతులు ఒకవైపు, మరోవైపు అనంతమైన చీకటి బ్రతుకులు. ఇవేవి పట్టనట్టుగా నిర్లిప్తంగా ఎవరో 'కీ' ఇస్తే ఆడే మర బొమ్మల్లా నిరంతరం పరుగులు పెట్టేజనం. నాకు ఎప్పుడు అర్థంకాని వింత పదార్థంలా కనబడే భాగ్యనగరం.

ట్యాంకు బండ్ మీద మహామహుల శిలాప్రతిమలు. బ్రతికి ఉన్నప్పుడు వీళ్ళు ప్రపంచాన్ని తమ వెంటనడిపించిన మహానుభావులు, ఇప్పుడెందుకో చేతలు

ఉడికి పోయి నిశ్చేష్టులైపోయి శిలాప్రతిమల్లా నిలబడి మూగగా రోదిస్తున్నట్టుగా ఉంది. హూస్సేన్ సాగర్ మురికి వాసనల మధ్య బందీలుగా నిలబడి పోయినట్లని పించింది.

నగరం నడిబొడ్డున ట్యాంకుబండను వొడ్డాణంగా చుట్టుకున్న నగరం కురుల్లో ముడిచిన తెల్లమల్లెలగా బిర్లామందిరం కాంతులీనుతుంది.

ఈ రెండ్ల కాలములో బిర్లామందిరానికి రావటం ఇది రెండవసారి. తెల్లగ ధగధగ లాడే పాలరాతి మందిరం నాకు బిర్లాల కళాతృష్ణ, భగవద్భక్తిని గుర్తు చేస్తుంది. ఆదివారం సాయంత్రాల్లో మరింత సందడిగా ఉండే బిర్లామందిరంకు సీతాకోక చిలుకల్లాంటి రంగురంగుల బట్టల్లో వయ్యారంగా కులుకుతు నడిచి వచ్చే జంటలు. బుగ్గలు చిదిమితే పాలుకారే ఎర్రటి ముద్దబంతుల్లాంటి పిల్లల కేరింతలు, భక్తి పారవశ్యంతో పరవశించిపోయే ముసలివారు. అందరు ఏదో తెలియని తన్మయత్వంలో మునిగి పోయినట్లుగా గుంపులు గుంపులుగా కదిలి ముందుకు పోతున్నారు.

మా ఆవిడ క్షణం సేపు ఆగి కొబ్బరికాయ కొన్నది పిల్లలు బొమ్మల దుకాణంలోని వివిధ రకాలైన వింతైన బొమ్మలను ఇంతింత కనులు చేసి చూస్తు ముందుకు కదిలారు.

ఇంత ఆనందకరమైన వాతావరణంలో చీకటి మరకల్లా మెట్లకు రెండు వైపులా బారులు తీరి పదిపైసల కోసం దేబిరించే ఎండిపోయి గోరంత మాంసము లేని క్షుద్బాధ పీడితులు మిగిలిపోయిన తమ యావత్ శక్తిని కళ్ళలో నింపుకొని పది పైసల ధర్మం కోసం దీనంగా అరిచే అరుపులు. అవి చూస్తే నా కడుపు తరుక్కుపోతుంది నా కడుపులో చేయ్యేసి దేవినట్టుగా అతలాకుతలం అయిపోతుంది. అందుకే అటువంటి చోట్లకు పోవాలంటే నాకెందుకో భయంగా ఉంటుంది. నేను వారివైపు చూడకుండా ఉండటం కోసం నా దృష్టిని ఎంత మళ్ళించుకున్నా సాధ్యం కాదు.

ఆదేదీ పట్టించుకోనట్టుగా నేను ఏమీ చూడనట్టుగా గబగబా వారిని దాటేసు కుంటు ముందుకు పోతున్నా, నా కండ్లముండి ఏ భిక్షగాళ్ళు తప్పించుకోలేక పోతున్నారు.

మందిరపు పాలరాతి చివరి మెట్టుకాడ నిస్సారమైన చూపులతో మాటాపలుకు

లేకుండా కూర్చున్న బిచ్చగాని మీద దృష్టి పడింది. అతని గడ్డం పెరిగున్నాది. బట్టలు చెరిగిపోయి అట్టుకట్టుక పోయినాయి ఏండ్ల తరబడి స్నాన పానాదులు లేకుండా జడలు కట్టిన జుట్టు జబ్బల వరకు పెరిగి ఉంది. అతని లోతైన కన్నుల్లో ఎక్కడో సుదూరంగా గత స్మృతిని వెదుకు తున్నట్టుగా చూపులు నిలబడి పోయినవి. అతను ఎవరిని దేబిరించడం లేదు. అతని ముందు పరిచి ఉన్న మురికి గుడ్డమీద కొన్ని చిల్లర డబ్బులున్నాయి.

అడుక్కోవడం ఇష్టం లేనట్టుగా అయినా అడుక్కోక తప్పనట్టుగా అతని మొఖం చూస్తే అనిపించింది. జేబులో పడి పైసలు తీసి అతని ముందున్న గుడ్డలో వేశాను.

ఒక్కసారిగా అతని గాజు కళ్ళను తిప్పి నా మొఖంలోకి చూసాడు. ఆ కళ్ళను చూస్తుంటే ఎందుకో నాకు గతంలో అతన్ని ఎక్కడో చూసినట్టుగా అన్పించింది. కాని ఎక్కడ? ఎప్పుడు? చూసింది గుర్తుకు రావటం లేదు. నా దృష్టి మళ్ళించుకొని ముందుకు కదిలాను అయినా అతని చూపులు నన్ను వెంటాడు తున్నట్టుగానే అన్పించింది.

యాంత్రికంగా ముందుకు కదిలినా నా అంతరంతరాల్లో అతన్ని ఎక్కడ చూసానబ్బా అంటు వెతుకులాట మొదలయింది. అందమైన పాలరాతి మందిరము పైన, శ్రావ్యంగా వినిపించే సంగీతంపై నా మనసు నిలవటంలేదు. బిర్లా మందిరం నుండి కనిపించే నాలుగు దిక్కులుగా ప్రాకిన నగరం అందచందాల మీద దృష్టి మల్లటం లేదు. నాకళ్ల ముందు అవే చూపులు నిలిచి పోయినట్టుగా అనిపించ సాగింది.

దైవ దర్శనం అయిపోయింది. నా ముఖావాన్ని చూ ఆవిడ పసిగట్టి నట్టుంది "ఏమైంది" అంది.

"అబ్బే ఏం లేదు" అంటూ దాటవేసాను.

ఆమెకు నా సమాధానం సంతృప్తి కల్గించినట్టులేదు.

"వెళ్ళిపోదామా" అంది

"సరే" అన్నాను.

వెనక్కి మళ్ళాము. అదే చివరి మెట్టుమీద అతను అదే చోట కూచొని ఉన్నాడు. అతన్ని గుర్తించటంకోసమన్నట్టుగా అతను నా కళ్ళకు కనుమరుగ

దూరంత వరకు మళ్ళీ మళ్ళీ చూసాను. అయినా అతన్నెక్కడ చూశానో గుర్తుకు రావడంలేదు.

పిల్లలకు నా ముఖభావం నచ్చలేదు "నాన్న నా బ్యాటు" అంటు మా చిన్నవాడు అడిగాడు.

ఇవ్వాళ ఆదివారం కదా "దుకాణాలు బందుంటాయి. నేను రేపు డ్యూటీనుండి తిరిగి వచ్చేటప్పుడు తెస్తాను" సముదాయించాను.

వాడు కొంత సమారాం చేసి మౌనం వహించిండు.

బస్సుస్టాపు వరకు ఆటోలో పోతే అక్కడినుంచి లోకల్ బస్సులో పోతే అనుకూలంగాను, ఆదాను ఉంటుంది. రోడ్డు వారగా ఆగిన ఆటోలో కూచొని వలానా బస్సుస్టాపుకు పోనిమ్మన్నాను. ఆటో కదిలింది

నేను మౌనంగా ఉండటంతో మా ఆవిడ కూడా మౌనంగా ఉండిపోయింది పిల్లలు కదిలే వాహనాలను చూస్తున్నారు. ఆటో వేగం అందుకుంది

అప్పుడు నాకు గుర్తుకు వచ్చింది.

సరిగ్గా ఎనిమిది సంవత్సరాల క్రింద పాలిటెక్నిక్ డిప్లోమా చేసి ఉద్యోగం కోసం వేట మొదలుపెట్టిన కొత్తలో మొదటి సారిగా కాల్‌లెటర్ వచ్చింది. ఉద్యోగం టెంపరరీది, అయినా మొదటగా వచ్చిన అవకాశం కావటంతో ఆ అవకాశాన్ని జారవిడుచుకోవద్దని కొంత, ఉద్యోగం చేయాలనే ఉత్సకతతో ఇంటర్వ్యూకు హాజరు అయినాను నెలకు నాల్గువందల స్టయిపండు హాస్టల్ వసతి ఉండటంతో ఆ ఫ్యాక్టరీలో చేరిపోయినాను.

ఆ ఫ్యాక్టరీ ఒక బట్టలమిల్లు. ఆ ఫ్యాక్టరీలోనే కపుడాఖాతా (బట్టలు నేసే సెక్షన్)లోనే అతను పనిచేసేవాడు అప్పటికి అతనికి పదిహేను సంవత్సరాల సర్వీసు మంచిపనివాడుగా పేరున్నది.

మిషనుమీద చేయ్యేసి దాని కదలికనుబట్టి మంచి చెడ్డలు నిర్ణయించేంత నైపుణ్యం ఉండేది. నిరంతరమైన పనిలో శ్రద్ధ, ధ్యాస అతనికి ఆ నైపుణ్యం అందేలా చేసింది. అందుకే అతనికి అందరిలో ఓ ప్రత్యేకత గుర్తింపు ఉండేది. పైగా మంచి మనిషి, సాత్వికుడు. తాను తనపని కుటుంబం ఇంతే అన్నట్టుగా గడిపేవాడు.

నేను పనిచేసే సెక్షన్‌లోనే అతను పని చేయడంతో అతనితో పరిచయం

పెరిగింది. అందులోను అతను ఉండేది కూడా నేను ఉండే హాస్టలుకు ఎదురుగా కార్మికులు నివసించే గుడిసెల ప్రాంతము కావటంతో డ్యూటీ నుండి వచ్చేటప్పుడో, పోయేటప్పుడో ఇద్దరం కలిసి పోయేవాళ్ళము. ఆ విధంగా మరికొంత పరిచయం పెరిగింది.

ఆ పరిచయంతోనే ఒకరోజు వారి ఇంటికి ఆహ్వానించాడు.

చాల చిన్న ఇల్లు సరిగా మాలాగే అప్పుడు అతనికి ఇద్దరు పిల్లలు స్కూల్లో చదివేవారు. అతని భార్యకూడా చాల అనుకూలవతి. అన్యోన్యమైన చిన్న సంసారం వారిది. వారితో మాట్లాడితే ఆత్మీయులను కలిసినంత సంతోషంగా ఉండేది గౌరవం కల్గేది

ఆ తర్వాత కొన్ని నెలలకు నేను ఆ ఉద్యోగం వదిలేసి వేరే ఉద్యోగంలోకి వెళ్ళిపోయాను. అక్కడక్కడ తిరిగి చివరికి ఇక్కడికి వచ్చాను. అయితే ఈ మధ్య కాలంలోనే ఆ ఫ్యాక్టరీని యజమాన్యం మూసేసిందని పేపర్లో చదివాను.

నలభై ఏండ్లుగా నడిచిన ఫ్యాక్టరీ మూతపడి పోయింది. ఆ ఫ్యాక్టరీ మీద వచ్చినలాభాలతోనే బిర్లా ఆ ప్రక్కనే మరో ఫ్యాక్టరీ కట్టేడు ఇంకా కొన్ని కొత్త ఫ్యాక్టరీలు నెలకొల్పిండు. పట్టిపోయిన అవులాంటి పాత టెక్నిక్‌తో నడిచే ఆ ఫ్యాక్టరీ వల్ల ఇక లాభాలు వచ్చే అవకాశం లేదని తెలిసిన తర్వాత దాని యజమాని నిర్దాక్షిణ్యంగా ఫ్యాక్టరీకి లాకౌటు ప్రకటించాడు. లాకౌటు ప్రకటనల్లో మేనేజిమెంటు చూయించిన కారణాలు ఏవీ సక్రమంగా లేవని లేబరు కోర్టు తీర్పు ఇచ్చింది.

ఐదువేలమంది కార్మికులు జీవనోపాధి కోల్పోయి పెండ్లాం పిల్లలతో వీధుల పాలయ్యారు. ఆకలిచావులు, ఆత్మహత్యలతో, అంతా అతులాకుతులం అయిపోయింది. కార్మికుల జీవితాలు చెల్లాచెదరయి అయిపోయాయి. కాన్వెంటులో చదివిన పిల్లలు వీధుల్లో ఆకలికి అలమటించిపోతూ అడుక్కు తింటున్నారు. ఆ బాధలు చూడలేని తండ్రులు ఫ్యాక్టరీ గేటు ముందున్న చెట్టుకు ఉరివేసుకున్నారు.

స్వచ్ఛంద సంస్థలు గోలమన్నాయి. పత్రికలు కథలు కథలుగా వారి కన్నీటి కథను ఏకరువు పెట్టాయి. కేంద్ర రాష్ట్ర మంత్రులు వచ్చారు, ఫ్యాక్టరీని తెరిపిస్తామని తియ్యటి కబుర్లు చెప్పి ఓట్లు దండుక పోయారు. ఫ్యాక్టరీ యజమానులు పోషించిన యూనియన్ నాయకులు గట్టు చప్పుడు కాకుండా ఎదిగిపోయి రాష్ట్రంలో మంత్రు అయి పోయారు.

ఏ చట్టం ఫ్యాక్టరీ యజమానిని శిక్షించలేదు. ఏ నీతి, ఏ ధర్మం జనుమేల కార్మిక కుటుంబాలను ఆదుకోలేదు.

నేను అక్కడ కొన్నిరోజులు పనిచేయడంవల్ల ఆ ఫ్యాక్టరీలో జరిగిన మార్పు అన్నీ నా మనసులో నాటుకుపోయాయి. ఇదంతా గుర్తుకు వచ్చి నా మనసంత అతులాకుతలం అయిపోయింది

ఆటో బస్సుస్టాపులో ఆగింది.

ఎందుకో అతన్ని కలవాలనే బలమైన కోరిక బయలు దేరింది. ముసాపేట బస్సులో పిల్లలను, మా ఆవిడను ఎక్కించి మరోగంటలో వస్తాను నాకు కొంచెం పనుంది అని మా ఆవిడకు చెప్పాను.

బస్సు కదిలింది. నేను ఆటో తీసుకొని మళ్ళీ బిర్లామందిర్‌కు పోయాను. గబ గబ అడుగులు వేసుకుంటూ మెట్లమీద పరుగులు పెడుతూ అతని కోసం వెతక సాగాను.

ఆ చివరి మెట్లువరకు వెళ్ళాను. కాని అతను అక్కడ కన్పించలేదు. ఏదో పోగొట్టుకున్న వాడిలా అక్కడంతా వెతికాను. ఎక్కడా కనిపించలేదు. నా ఆతృత ఆపుకోలేక పోయాను. అక్కడున్న మిగితా భిక్షగాళ్ళను అడిగాను.

"ఇక్కడో సర్‌సిల్క్ కార్మికుడుండాలి ఏమైండు" అని అడిగాను

నా ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేదు. నేను మళ్ళీ మళ్ళీ ఒకటికి పది సార్లు అడిగాను. ఎవరు చెప్పలేదు.

నా వొంట్లోని రక్తాన్ని చేవను ఎవరో పీల్చిపిప్పి చేస్తున్నట్టుగా అనిపించ సాగింది. నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. నీళ్ళునిండిన కళ్ళతో ఒక్కసారి బిర్లామందిరం కేసి చూసాను

ఎందుకో ఆ తెల్లని పాలరాతి మందిరం జనుమేం మాది సర్‌సిల్క్ కార్మికుల కుటుంబాల ఎండిపోయిన శవాలను పేర్చికట్టినట్టుగా నెత్తురోడుస్తూ ఎర్రగా అప్పుడే చిమ్మిన రక్తంలా కనిపించసాగింది.

# నికరాగువా విప్లవ కవిత్వం :

## జీరో అవర్

కార్డెనాల్

అప్పుడు వాళ్ళు కొండల్లోంచి వచ్చారు
కొండల్లోకే వెళ్ళిపోయారు
అగ్రభాగాన పతాకాలు పట్టుకుని
రహదార్ల మీది బురదగుంటల్లోంచి
కవాతు చేస్తూ కసాపిసా నడుస్తూ
వాళ్ళొచ్చారు
ఆ సైన్యంలో ఉట్టిపాదాల వాళ్ళూ ఉన్నారు
బూట్లు తొడిగిన వాళ్ళూ ఉన్నారు
కాని దాదాపు ఎవరూ సాయుధులు కారు
వాళ్ళకు క్రమశిక్షణా లేదు
అరాచకత్వమూ లేదు
వాళ్ళలో నాయకులూ లేరు
జీతాలు పుచ్చుకొనే సైనికులూ లేరు
ఐతే వాళ్ళలో వాళ్ళకు
కొట్లాడుకునే అవసరమే లేదు
వాళ్ళకు సైనిక హోదాలున్న మాట నిజమే
కాని అందరూ సమానమే
తిండీ బట్టా పంపకంలో
వివక్షలు లేవు
అందరికీ ఒకే రేషన్లు
నాయకులకు సేవకులు లేరు
అది సైన్యంలా లేదు
ఒక సంఘంలా ఉంది

వాళ్ళను సమైక్యం చేసింది
ప్రేమేగాని సైనిక క్రమశిక్షణ కాదు
ఐనా ఇంతవరకూ
ఏ సైన్యమూ
అలాంటి ఐక్యత అనుభవించలేదు
గిటార్లతో కౌగిలింతలతో
అది ఆనందం నిండిన సైన్యం
'అడెలిటా మరొకరి వెంట వెళిపోతే
భూమి మీదనైనా సముద్రం మీదనైనా
నేనామెను వెంటాడుతాను
సముద్రం మీదనైతే యుద్ధ టాంకర్ మీద
భూమి మీదనైతే సైనిక రైలు మీద'
అనే ప్రేమగీతమే
వాళ్ళ యుద్ధ శంఖారావం.

## ముక్కల్లో కవిత

ఎం కువాడ్రా

నియంతలు మన చేతులూ కాళ్ళూ కట్టేస్తారు
మన పళ్ళని తీగలతో కుట్టేస్తారు-
ఎందుకంటే దుర్బలుడు మాటకే భయపడతాడు
నగరాల వీధులను మనతో ఊడుస్తారు వాళ్ళు
కక్కసుతొట్లను మనతో నింపుతారు వాళ్ళు
మనను మురికి గుంటల్లో ముంచుతారు
కానీ ఇది మహాద్భుతాలు జరిగే సంవత్సరం

ఎందుకంటే
స్వేచ్ఛ అచ్చు అక్షరంలో లేదు
స్వేచ్ఛ దొంగల సమావేశాల చర్చల్లో పుట్టింది కాదు
స్వేచ్ఛ పార్లమెంటరీ గొర్రెల అరుపుల్లోంచి పుట్టలేదు
స్వేచ్ఛ- ఆ మాట మా మనస్సాక్షుల్ని పటకారులో బిగిస్తుంది

ఎండిపోయిన రొట్టె ముక్క కొరుకుతున్న
ఆ అభాగ్యుడి వేపు చూడండి
దాచి పెట్టుకున్న తన కోర్కెను
తీర్చుకోలేని ఆ యువతి వేపు చూడండి
ఆగ్రహంతో చచ్చిపోయిన
కార్మికుణ్ణి చూడండి
పూజారినీ
పాత్రికేయుణ్ణీ చూడండి
మరి పైనెక్కడో
ధనం మత్తెక్కి నాట్యమాడుతోంది
అది నాణానికి మరోవైపు.

"మేం ఎప్పుడూ ఆలస్యంగా వస్తాం
మేం ఆలస్యం చేశాం
మేం ఆలస్యంగా చచ్చిపోతాం"
ఇది చెత్తగా లేదూ?

కాని
మా దారుల మీద
ఒక మహత్తర ఉషోదయం ప్రభవిస్తుంది
ఎందుకంటే దేవుడు మా మధ్య నడవడానికి సిద్ధపడ్డాడు

మేం తినని రొట్టె
సుదూరాన ఎక్కడో
గాదెల్లో మురిగి పోతోంది
ద్రాక్ష సారా మరెక్కడో
పాత్రల్లో పులిసెక్కుతోంది
ఒక్క ముద్దు, ప్రేమించిన స్త్రీ ఇచ్చే ఒకే ఒక్క ముద్దు-
ఎక్కడ భూమి ముక్కలుగా విరిగిపోయిందో
అక్కడ వెతుక్కోండి

మేం ప్రతిసారీ పరిపూర్తి నుంచి
ఓ అంగుళం దూరమే ఉండిపోయాం
మా బలహీన హృదయాల
చూపుల్లోనే లోపం ఉంది
మా స్పర్శను మోసం చేసే
నునుపుదనంలో లోపం ఉంది
మా ఘ్రాణ శక్తిని విచ్ఛిన్నం చేసే
పూలతోటలో లోపం ఉంది

మహాఘనత వహించిన మంత్రిగారు
రెండు రెళ్ళు అయిదవుతాయని మాకు తెలియజెప్పాక
మా అసహ్యకరమైన ఇంద్రియాలనే తప్పుపట్టాలి
ఇన్నాళ్ళూ మేం రెండు రెళ్ళు నాలుగవుతాయనుకున్నాం
ఈ సాధారణ వాస్తవాలూ జనమూ ఒకటే అయినప్పుడు
కఠిన నేపథ్యాల వెనుక పట్టపగటి వెలుగులో
గాలిలోంచి విసరిన కరవాలం వలె
ప్రపంచం హఠాత్తుగా స్వచ్ఛంగా మారుతుంది

## ఒకవేళ నేను తిరిగి రాకపోతే ?

ఎడ్విన్ కాస్ట్రో

ఒకానొక రోజు నేను తిరిగొస్తే
మనం పల్లెసీమలకు తరలిపోదాం
ఒకప్పటి సంతోష సమయాలలో
గడిచిన ఏప్రిల్‌లో
చేయీ చేయీ పట్టుకుని
నడిచిన రహదారి మీదనే
మళ్ళీ కలిసి నడుద్దాం

బహుశా అది మరో ఏప్రిల్ అవుతుంది
వేడెక్కి దుమ్ము కొట్టుకొని ఉంటుంది
ధూళి తివాచిలో
మన అడుగులు కలిసి పడతాయి
నేను పొరుగు నగరాల
ముళ్ళకంచెల మీదికెక్కి
పసుప్పచ్చ పూగుత్తుల్ని తెంపి
నీ చేతుల్లో పెడతాను
జకరాండా నుంచి
అందమైన ఎర్రని పూగుత్తుల్ని దొంగిలించి
నీ గుండెల మీద అలంకరిస్తాను
మనం సెలయేటి దాకా నడిచి
ప్రశాంతమైన నీళ్ళల్లో
మన చేతులు తడుపుకుంటాం....
ఒకవేళ నేను తిరిగి రాకపోతే ?
నేనెప్పటికీ తిరిగి రాలేకపోతే ?
మరేం ఫర్వాలేదు
పల్లెసీమలకు వెళ్ళు
మనం ఒకప్పుడు కలసి నడిచిన
పాత రహదారి మీద
మన కొడుకును తీసుకుని సాగిపో
నీ గుండెల మీద అలంకరించడానికి
అందమైన జకరాండా పూలు
కోసి పెట్టమని వాణ్ణి అడుగు
సమీప గడ్డి మైదానాల
ముళ్ళ కంచెలెక్కి
నీ కోసం పసుప్పచ్చ పూగుత్తులు
తెచ్చి పెట్టమని చెప్పు

వాడితో కలిసి
సెలయేటి దాకా నడిచి
చేతులు తడుపుకో

ఆ స్వచ్ఛ జలాలలో
నీకు నా స్పర్శ అనుభూతమవుతుంది
నా ఎడబాటుతో తెరుచుకున్న కొలువల్ని
ఆ స్పర్శే నింపుతుంది

## జీవిత చరిత్ర

లెనియోల్ రుగామా

జాన్ పాఠశాల గోడల మీద
అతని పేరెప్పుడూ కనబడలేదు
శాశ్వతంగా తరగతి గది వదిలేసిపోయినప్పుడూ
అతని అదృశ్యాన్ని ఎవరూ గుర్తించనేలేదు

ప్రపంచపు సైరన్‌లన్నీ
నిశ్శబ్దంగా ఉండిపోయాయి
అతని రక్తంలో జ్వాలల్ని
అవి ఎప్పుడూ కని పెట్టలేకపోయాయి
ఆ మంటల వేడిమి
ఇంకా ఇంకా దుర్భరమై
చిట్ట చివరికి
అతని అడుగుల సవ్వడి
పర్వతాల నీడల్ని పెనవేసుకుంది

ఆ ఫలవంతమైన భూమి
తన నిగూఢత్వంతో అతణ్ణి పోషించింది
ప్రతి గాలి తెమ్మెరా

అప్పుడే స్నానం చేసి ఒణుకుతూ
నగ్నంగా నిలబడ్డ వాడిలా
అతని ఆదర్శాలకు శుభ్రం చేసింది
యుద్ధం విస్ఫోటనమయ్యేముందు
సకల ప్రపంచమూ చెవిటిదై
అతణ్ణి వినలేకపోయింది

## ఐక్యత

మాక్ ఫీల్డ్

ఐక్యం కండి
దెబ్బతీయడానికి చేతులు కలపండి
మన గళాన్ని ఎలుగెత్తడానికి శక్తుల్ని కలపండి

బూడిదల్ని కుప్పపోసి
మనం పోగొట్టుకున్నదంతా లెక్కించండి

వాళ్ళు మన గుమ్మాల ముందునుంచి
మన కళ్ళ ముందరే
తోడులేక ఏకాకులుగా
ఏకాంతంలో ఒంటరితనంలో
అప్పటికే ఒంటరితనంలో విచారంలో మరణించి
మరణం వైపు నడిచిపోయారు

ఐక్యం కండి
మన స్వప్నాలను ఐక్యం చేద్దాం
మన ప్రళయాకాంక్షలను ఐక్యం చేద్దాం
మనం ఒక చీమల పుట్టలాగ
సమైక్యంగా జీవిద్దాం

విషానికి విషం కలిపి
బాధకు బాధ కలిపి
దుఃఖానికి దుఃఖం కలిపి
మన పళ్ళు పదును పెట్టుకుంటూ
మన చూపులు నిశితం చేసుకుంటూ
మన మాటల బాణాలు వాడి చేసుకుంటూ
ఐక్యం కండి

వాళ్ళు మన ముందర
నింగి దాకా గోడలు లేపుతున్నారు
వాళ్ళు మన దారిని
అన్ని వైపులా తెంచివేశారు
వాళ్ళు మనమీదికి
ఆయుధాలు ఎక్కుపెడుతున్నారు
మనను వెంటాడుతూ
నిఘా వేస్తూ, బాధిస్తూ
అనుకోని వేళల్లో
హెచ్చరిక లేకుండా
మౌనంగా ఎదురుపడుతూ
వాళ్ళు చీకట్లో సాగివస్తున్నారు

వాళ్ళు మన మీద
కోరల్ని పదునెక్కించు కుంటున్నారు
వాళ్ళు మనను
బడ్జెట్ల అంకెల్లోకి కుదిస్తున్నారు
మనకు చదువు నేర్పుతున్నారు
మనను దువ్వుతున్నారు
బెదిరిస్తున్నారు
ముద్దాడుతున్నారు

చెరుస్తున్నారు
మన కడగండ్లే
వాళ్ళ వేతనాల విందులుగా బతుకుతున్నారు

ఈ చీకట్లోనే నేను
వెలుగు కోసం వెతుకుతాను
మేల్కొలిపే నినాదాల కోసం వెతుకుతాను
ఒకే ఒక్క జ్వలించే జ్వాలకోసం వెతుకుతాను
ఇక్కడొక జ్వాల వెలిగితే
అక్కడొక జ్వాల మలిగిపోతోంది
నేనీ చీకట్లో జ్వాల కోసం వెతుకుతాను

ఐక్యం కండి
దెబ్బతీయడానికి చేతులు కలపండి
గళాన్ని ఎలుగెత్తడానికి శక్తులు కలపండి

ఒక ఇసుక రేణువు, మరొక్క ఇసుక రేణువు
ఇంకొక్క ఇసుక రేణువు, మరొక్క ఇసుక రేణువు
ఇంకొక్క ఇసుక రేణువు, మరొక్కటి, మరొక్కటి, మరొక్కటి....
చీకట్లో ఒక్క వెలుగు, మరొక్క వెలుగు, ఇంకొక్క వెలుగు
మరొక్కటి, మరొక్కటి మరొక్కటి.

నేను సాహసం కోరుకున్నాను
వాళ్ళు నాలో
భయం, దిగులు, ఒంటరితనం నింపారు.

దయ్యాల లాగ సాగిపోయే
ఒక జ్వాలా, మరొక జ్వాలా....
అవి మన గుమ్మాల ముందు సాగిపోతాయి
మన కళ్ళ ముందరే సాగిపోతాయి

ఒంటరిగా
ఒంటరితనం తెచ్చిన మృత్యువులో
ఒక జ్వాలా, మరొక జ్వాలా....

మనమీ చీకటికి నిప్పంటిద్దాం
మైదానం మంటల మయమైపోనీ
బాధామయ జీవులు
మంటల్లో తలెత్తి నిలవనీ
అంధకారం మంటల్లో చిటపట లాడనీ
తప్పనిసరిగా వేకువ పొడవాల్సిందే

ఒక ఇసుక రేణువు....మరొక ఇసుక రేణువు
ఇంకొక్క ఇసుక రేణువు
మరొక్కటి, మరొక్కటి, మరొక్కటి

విశాల విశ్వంలో
చెల్లాచెదరైన వెలుగు రవ్వలు
ఇసుక రేణువులు
ఐక్యమయ్యాయి

దెబ్బ తీయడానికి చేతులు కలపండి
గళాన్ని ఎలుగెత్తడానికి ఆయుధాలు కలపండి.

## వాళ్ళు చీకట్లో మమ్మల్ని వెంటాడారు

నజ్లిస్

వాళ్ళు మమ్మల్ని చీకట్లో వెంటాడారు
వాళ్లు మమ్మల్ని చుట్టుముట్టారు
ఇంక మాకు మా చేతులు తప్ప
మరే రక్షణా మిగల లేదు
ఐక్యమైన శతకోటి హస్తాలవలె
మా చేతులు ఏకమయ్యాయి
వాళ్ళు మా చేత రక్తం కక్కించారు
మమ్మల్ని కొరడాలతో బాదారు

వాళ్ళు మా శరీరాలను
విద్యుదాఘాతాలతో చిందరవందర చేశారు
వాళ్ళు మా నోళ్ళలో సున్నం కుక్కారు
వాళ్ల మమ్మల్ని రాత్రుళ్ళలో
క్రూర మృగాల బారిన వదిలేశారు
కాలం తెలియని చీకటి కొట్లలో
వాళ్ల మమ్మల్ని బంధించారు
వాళ్ల మా వేళ్ళగోళ్ళు పెరికేశారు
గదుల కప్పులమీదా
చివరికి తమ ముఖాలమీనా
వాళ్ళు మా నెత్తురు చిందించారు
ఐనా మా చేతులు
శతకోటి ఐక్య హస్తాలవలె దృఢంగానే ఉన్నాయి
పడిపోయిన తమ కామ్రేడ్‌ల రైఫిళ్ళను
అమాయకులు ఎత్తి పట్టుకున్నారు
దాచలేని సూర్యునివలె
అమాయకులు సాయుధంగా లేచి నిలిచారు
అమాయకులు ఎలుగెత్తి గర్జించారు
కోట్లాది ప్రజలకు తమ నినాదం వినిపించారు
అమాయకులు రక్తమోడ్చారు
వాళ్ళ నెత్తురు నేలనేలనంతా తడిపేసింది
అమాయకులు మృత్యువునుంచి మేల్కొన్నారు
ఆ మేల్కొలుపే జీవన ప్రారంభం
ప్రతి జీవితం సంతరించుకునే నీళ్ళతో
నదులు పొంగి ప్రవహించడం మొదలెట్టాయి
గాలి గాలంతా
ప్రేమ గీతమై పోయింది
ఉయ్యాల పాటయి పోయింది

అల్లికల్లో తల్లులు
తమ పిల్లల యుద్ధాలను నేశారు
జన్మించిన మానవుల్ని చూసేందుకు
ఉషోదయవేళన స్త్రీలు పరుగెత్తుకొచ్చారు
పిల్లలు మట్టిబొమ్మలు చేసి
మంటల్లో కాల్చారు
తమ దేహాలతో తమ తండ్రుల దేహాలతో పోరాడారు
ప్రతి విజయమూ
ఒక నూతన శిశువుకు జన్మనిచ్చింది
ప్రతి శిశువూ ఒక నూతన విజయాన్ని సాధించాడు
తరాల వంశవృక్షంలో
విజయాలూ శిశువులూ
పదేపదే
వికసించారు

## మేం - వాళ్ళు

ఆర్. మొరాలెస్ ఆవిల్స్

కాలానికీ స్థలానికీ అర్థమేమిటి?
ఓ బిందువుకూ మరో బిందువుకూ మధ్య దూరం
మమ్మల్ని అనుసరించే ఇతరులు
మమ్మల్నీ వాళ్ళనూ ఏకంచేసే బంధాలు
పోరాటపు నిశ్చితత్వం
ప్రేమ నిశ్చితత్వం
జీవిత నిశ్చితత్వం.

యాభై ఏళ్ళ తర్వాత
ఒక కొత్త వేకువ వేళన
అరుణారుణ సూర్యోదయాన

ఆ ఇతరులు ఉద్యమ భవిష్యత్తును చూస్తారు
చిన్నవీ పెద్దవీ దీవులెన్నో
జన్మించడం వాళ్ళు చూస్తారు
యాభై ఏళ్ళు కాకపోతే
బహుశా వందేళ్ళు కావచ్చు
రెండువందలేళ్ళు కావచ్చు
ఇంకెన్నో ఏళ్ళు పట్టవచ్చు
వాళ్ళు తప్పకుండా
పుష్కలమైన ధాన్యపు కుప్పల్ని దర్శిస్తారు

మేమూ వాళ్ళూ
ఒకతరం, మరెన్నో తరాలు
మరి
ఉద్యమం
ఒక బిందువు నుంచి మరో బిందువుకు ప్రవహిస్తుంటే
కాలానికీ స్థలానికీ అర్థం లేదు.

## పాంకాసన్

ఆర్. మొరాలెస్ ఆవిల్స్

అది ప్రజలు చేసుకున్న నిర్ణయం
వాళ్ళు కేవలం మాటలతో తృప్తిపడేవాళ్ళు కాదు
ఇంక చాలు అనే మాట—
అది వాళ్ళ నిర్ణయం.
ఖచ్చితమైన కోపంతో
ముక్త కంఠంతో పలికారు వాళ్ళు
అధికారం మీద విరుచుకు పడుతున్నట్టు
ఎలుగెత్తారు వాళ్ళు
నగరమూ దేశమూ

సూర్యుని వేపు
అవశ్యమైనదేదో దాన్ని సాధించే వేపు
కవాతు మొదలెట్టాయి
అది
తిట్లతో శాపనార్థాలతో
కోపం నిండిన అభినయాలతో
కళ్ళలో ఒంట్లో కడుపులో
సూదులతో సాగిన బాట
ఒక్క మాటని కాదు
బహుశా మా చేతుల్లోని
ఖచ్చితమైన మంటే సూది
మధ్యాన్నానికల్లా
వాస్తవాని కెదురుగా నిలబడ్డప్పటి కల్లా
మేం సందేహాలను అధిగమించాం
డబ్బులో తలమునకలయిన లావాటి పశువు
మా ఎదురుగా నిలబడ్డప్పుడు
వార్తలు అరుస్తున్న విదేశీ సంకర జంతువు
వీధిలో మా ఎదురుగా నిలబడ్డప్పుడు
మేం సందేహాలను అధిగమించాం
ఒక్క క్షణం కిందివరకూ మాపైన
మా రక్త మాంసాలను
తృణప్రాయంగా అర్పిస్తూ ముందుకే సాగాం
మృత్యువంటే మాకు పరాయిదయినట్టు
ముందుకే నడిచాం
అప్పుడే ఎవరో చెప్పారు
ప్రతిదానికీ అంతంలోనే ఆరంభం ఉంటుందని....

# మేం భయం పోగొట్టుకున్నాం

ఫెర్నాండెజ్

వాళ్ళు మా కోసం వస్తారని
మేమిక ఊహించనక్కర్లేదు
కాస్త ముందో వెనకో
వాళ్లు మా కోసం వస్తారని
మాకు చాన్నాళ్ళ కిందే తెలుసు

ఎదురు చూపులో ఉన్నప్పుడు
అప్పటిదాకా కూడ బెట్టుకున్న విషాలన్నిటితో
మాకు మా గాయాల్ని మాన్చుకునే తీరిక దొరికింది
ఒకరినొకరం మరింత ఎక్కువగా
ప్రేమించుకోవడం నేర్చుకునే తీరిక దొరికింది

ఇతరుల కోసం వాళ్ళొచ్చినప్పుడు
వాళ్ళెట్లా వస్తారో మేం చూస్తుండే వాళ్ళం
వాళ్ళు మా కోసమే వచ్చే సమయం
ఇంకా ఇంకా దగ్గరి కొచ్చేసింది
మా నిస్సహాయ ప్రేమలోంచి
ముఖ్యమైన నాలుగు స్థలాల్లోంచి
వాళ్ళు మా కామ్రేడ్ల రక్తాలు ప్రవహింపజేశారు

ఇక మేం సిద్ధంగా ఉన్నాం
ఇప్పుడు వాళ్ళు మా కోసమే వస్తున్నారు
ఐతే
మేమూ వాళ్ళ కోసమే నడుస్తున్నాం

# విజయం వేపు యాత్రలో వెనుకడుగు లేదు

రెల్లి

కామ్రేడ్
యుద్ధం అశేష ప్రజలది
అది సుదీర్ఘమైనది
అది అలసటను ధిక్కరిస్తుంది
యాదృచ్ఛికతనూ సులభ విజయాన్నీ
వెనుకడుగునూ ధిక్కరిస్తుంది
గెరిల్లా యోధుడంటే నినదించే రహస్యం
ఆ రహస్యం
మన జనాల రక్తనాళాల్లో ప్రవహిస్తుంది
అది రైలింజను లయబద్ధ ధ్వని లాంటిది
సంతోషం నిండిన దాని కూత
వాస్తవికతను సవ్యంగా అధ్యయనం చేసిన
దృఢమైన పట్టాల మీద
క్రమంగా సాగే ప్రయాణాన్ని
మోసుకొస్తుంది

మన జనాలు బాధలనుభవించారు
కామ్రేడ్
వాళ్ళ పిల్లలు నిర్దాక్షిణ్యంగా హత్య చేయబడ్డారు
వాళ్ళ స్వచ్ఛ కోమల దేహాలు
కఠిన లోహ శవాల మీద
రాపాడిన దుర్భర వేదననుభవించారు
అందుకే గెరిల్లా యుద్ధం అవసరం

క్రామేడ్ -
అందుకే
రాయి విసిరి చెయ్యి దాచుకోవడం అవసరం

చుట్టు ముట్టడం,
అడవిలోంచి పరుగెత్తుకు రావడం,
అడవి నీడల వెచ్చదనంలో రక్షణ తీసుకోవడం,
అడవి కౌగిలి చల్లదనంలో నిలిచి ఉండడం,
తిని, కాసేపు కునుకు తీసి
వాళ్ళకు అనూహ్యమైన చోట
మళ్ళీ దాడికి సిద్ధపడడం,
లేచి నిలవడం,
వెనక్కి తగ్గడం,
తన ప్రాణం తీసే తూటా
ఎక్కడ్నించి వస్తుందో తెలియని శత్రువును
చిందరవందర చేయడం
అవసరం

.... .... ....

ఇతరులు ఎక్కడో మధ్య దారిన నిలిచి
అనుమానాస్పద ప్రశంసలు పొందనీ
మనకు మౌనంగా పని చేయడం ఎలాగో తెలుసు
మనకు తుపానులను నిర్మించడం ఎలాగో తెలుసు
సాండినో వదిలి వెళ్ళిన దిమ్మమీద
సమ్మెటలతో మెరుపుల్ని సృష్టించడం
మనకు తెలుసు
కామ్రేడ్
మనకు తెలుసు
శత్రువు బేజారు గుండెల్ని
మనం పర్వతాల్లో సమాధి చేస్తామని
మనకు తెలుసు.

# థామస్‌బోర్గ్‌కి : ఉషోదయం ఇక స్వప్నం కాదు

ఫెర్నాండెజ్

పూరేకులు
పరాగాల్నీ
పుప్పొడినీ
కొనిరావడం మొదలైంది
పులిపిల్లలు
తమ పొట్టెత్తే చిగుళ్ళలోంచి
మొలుస్తున్న పళ్ళను కనిపెట్టాయి

ఈ ఆధునిక యుగాల లోతైన గనుల్లో
దాగిన దినాలం మేం
మేం స్వచ్ఛమైన ప్రేమతో నెత్తుటితో
తయారయ్యాం
వీపు మీద తూటా తగిలి అదృశ్యమైన
మరణం లేని మా అన్నల నుంచీ అక్కల నుంచీ
రూపొందాం మేం.

ఇప్పుడిక
మా హృదయాల్లో ఉన్నదంతా లేచి నిలుస్తుంది
నడవడం మొదలెడుతుంది
మేమిప్పుడు
తలుపంటే, బల్లంటే, రొట్టె అంటే
అంతిమ సుమధుర అర్థాలను
పునరన్వేషిస్తున్నాం
మోనింబో, మాటాగల్పా, సబ్ టియావా, ఎస్టెలి, అన్న
అనే మరిచిపోలేని పదాల
బిగిసిన పిడికిళ్ళు ఎత్తుతున్నాం

# సమ్మె

రెల్లి

మనందరమూ కలిసి ఉండే సమ్మెను
నేను కోరుతున్నాను
చేతుల సమ్మెను
కాళ్ళ సమ్మెను
వెంట్రుకల సమ్మెను
ప్రతి ఒక్కరి దేహాల్లోంచి మొలకెత్తే సమ్మెను
నేను కోరుతున్నాను

కార్మికుల సమ్మెను
సాంకేతికుల సమ్మెను
డ్రైవర్ల సమ్మెను
డాక్టర్ల సమ్మెను
నేను కోరుతున్నాను

నేను పక్షుల సమ్మెను కోరుతున్నాను
పూల సమ్మెను కోరుతున్నాను
చిన్నారి పాపల సమ్మెను కోరుతున్నాను
స్త్రీల సమ్మెను కోరుతున్నాను
నేనొక మహత్తరమైన సమ్మెను కోరుతున్నాను

అది
ప్రేమకు ఉన్న అన్ని దారుల్నీ స్పృశిస్తుంది
ఆ దారి మీద
గడియారాలూ
అధికారులూ
కార్ఖానాలూ

చర్చిలా
బస్సులా
రోడ్లూ
పాఠశాలలా ఓడరేవులా
అన్నీ ఆగిపోతాయి
నేను కళ్ళ సమ్మెను
చేతుల సమ్మెను
ముద్దు సమ్మెను
ఏవరూ ఊపిరి పీల్చని సమ్మెను కోరుతున్నాను
అప్పుడు
పారిపోతున్న నియంత అడుగుల చప్పుడు
మనకు వినబడే లాగ
ఆ సమ్మెలో జన్మించాలి
నిశ్శబ్దం

## మనం కొత్తవాళ్ళమవుతాం

రెల్లి

ప్రియతమా, మనం కొత్త వాళ్ళమవుతాం
మనం పాతనంతా అసహ్యకరమైనదంతా కడిగేస్తాం
కుళ్ళిపోయిన పెటీబూర్జువా ధోరణులనూ చెడులనూ
నెత్తుటితో కడిగేస్తాం
మనం కొత్త వాళ్ళమవుతాం
స్వచ్ఛమైన కళ్ళతో మెరిసే నోటితో
జనాల కొట్టెలాంటి మామూలు మాటలతో
జనోటీప్‌లోనో పాజ్ సెంట్రోలోనో
మెత్తని చీజ్ చుట్టి ఇచ్చే
గట్టి రొట్టెల్లాగ తయారవుతాం

మనం దృఢంగా సాదాగా ఉంటాం
గిటార్ల ఉత్సవాల మధ్య
గడ్డి వాపల మీదా గడ్డి పరుపుల మీదా
మన పిల్లలు పుట్టి పెరుగుతారు
వినూత్నమవుతాం మనం
ప్రియతమా, నీకర్థమవుతోందా ?
ఉజ్వలమైన, ప్రకాశవంతమైన నూతనత్వం
అప్పుడే పుట్టిన నక్షత్రాల వలె,
చంద్రుల వలె, సూర్యులవలె నూతనత్వం
మన వెంట్రుకలు కడగబడతాయి
మన నెత్తురు శుభ్రపరచబడుతుంది
మన మౌనం స్నానం చేయించబడుతుంది
ప్రియతమా, మనం కొత్త వాళ్ళమవుతాం
యుద్ధరంగం మీది దుస్తుల శుభ్ర స్వచ్ఛ సువాసనలతో
గాలిలో విస్తరించిన మహత్తర స్వేచ్ఛా సవాల్‌తో
పక్షుల ప్రయాణం వలె
మనం కొత్తవాళ్ళమవుతాం

---

# నికరాగువా : విప్లవ విజయ వైఫల్యాలు

"ప్రజల సార్వభౌమత్వమూ, స్వేచ్ఛా చర్చలద్వారా తేలేవి కావు. చేతుల్లో ఆయుధాలతో పరిరక్షించవలసినవి"– అగస్టో సాండినో (1895-1934)

"సాండినో అంటే విరుచుకుపడే రాత్రి
సాండినో అంటే సముద్రం మీదినుంచి
పరుగెత్తుకొచ్చి చంపేసే వెలుగు
సాండినో జండాల సమున్నత శిఖరం
సాండినో ఆశల తుపాకి...."

— పాబ్లోనెరూడా

లాటిన్ అమెరికాలో ఉజ్వలమైన పోరాటచరిత్ర గల దేశం నికరాగువా. కాని ఆ జండాల సమున్నత శిఖరం 1990 ఫిబ్రవరి 25న కూలిపోయింది. ఆ ఆశల తుపాకి ఓడిపోయింది. 1973 సెప్టెంబర్ 11న చిలీలో సాల్వెడార్ అలెండీ ప్రభుత్వం ఏ లోపాల వల్ల సైనిక కుట్రకు బలి అయి పతనమైపోయిందో, సరిగ్గా ఆ లోపాల వల్లనే ఇప్పుడు నికరాగువాలో డానియెల్ ఆర్టెగా ప్రభుత్వం "పార్లమెంటరీ" కుట్రకు బలి అయి కూలిపోయింది.

అయితే నికరాగువా అనుభవం కేవలం ఒక ప్రభుత్వం కూలిపోయి, మరో ప్రభుత్వం గద్దెనెక్కడం మాత్రమే అయితే దాని గురించి అంతగా ఆలోచించవలసిన పని లేదు. కాని నికరాగువా ప్రజలు దశాబ్దాలుగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుతూ వచ్చారు. సామ్రాజ్యవాదుల కీలుబొమ్మలైన నియంతలను కూలదోసి తమదైన విశాల ఐక్య సంఘటన ప్రభుత్వాన్ని స్థాపించుకున్నారు. విశాల ఐక్య సంఘటన ప్రభుత్వం అయినందువల్లనే ప్రపంచ వ్యాప్తంగా ఉదారవాదుల నుంచి మార్క్సిస్టుల వరకు అన్ని వర్గాల ప్రజల ఆదరణను అనుభవించారు. ఐనా పది సంవత్సరాలలోనే ఆ ప్రభుత్వం "ఎన్నికలలో" ఓడిపోయింది!

అందువల్లనే నికరాగువా అనుభవం సామ్రాజ్యవాద స్వభావం గురించీ, సామ్రాజ్యవాద రాజకీయ, సైనిక, ఆర్థిక కుట్రల గురించీ, పార్లమెంటరీ విధానం గురించీ, ఉదారవాదం సాధించగల మంచిని వెన్నంటే ఉండే కీడును గురించీ విలువైన పాఠాలనే నేర్పుతుంది.

మధ్య అమెరికాలోని చిన్న దేశమైన నికరాగువా నుంచే గెరిల్లా పోరాటం అనే భావన రూపుదిద్దుకుంది. 1930 లలో అగస్టో సెజానో సాండినో గెరిల్లా పోరాట వ్యూహాన్ని రచించి అమెరికన్ సైన్యాలను ముప్పుతిప్పలు పెట్టాడు. ఐతే నికరాగువన్‌లు అమెరికన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఎన్ని పోరాటాలు చేస్తూ వచ్చినా గత నూటయాభై సంవత్సరాలుగా నికరాగువా అమెరికన్ కుట్రలకూ, ఆధిపత్యానికీ బలి అయిపోతూనే ఉన్నది. 1850 ల నుంచీ కీలుబొమ్మ ప్రభుత్వాలను ఏర్పరచడం, ఎన్నికలను ఫార్సుగా మార్చి తరచుగా సైనిక జోక్యం కొనసాగించడం, ప్రభుత్వాలను తన ఇష్టారాజ్యంగా మారుస్తుండడం వంటి పద్ధతుల ద్వారా అమెరికన్ ప్రభుత్వం నికరాగువా మీద సర్వాధికారాలనూ చలాయిస్తూ వస్తోంది. మధ్య అమెరికాలో రవాణా కాలువ నిర్మించేందుకు 1909లో నికరాగువా అధ్యక్షుడు జెలాయా జర్మన్, జపనీస్ కంపెనీలకు అనుమతి ఇచ్చినప్పుడు అమెరికన్ సైన్యాలు నికరాగువాలో ప్రవేశించాయి. అధ్యక్షుణ్ణి మార్చి, దేశ ఆర్థిక వ్యవస్థ మీద అమెరికన్ బ్యాంకులకు అధికారాన్ని కట్టబెట్టాయి. మళ్ళీ 1912 నుంచి 1925 దాకా, 1926 నుంచి 33 దాకా అమెరికన్ సైన్యాలు నికరాగువాలో తిష్టవేశాయి.

కాఫీ ప్లాంటేషన్ల వల్ల ప్రారంభమైన భూమి సమస్య అనేక రైతాంగ తిరుగుబాట్లకు దారి తీసింది. ఈ తిరుగుబాట్లలో భాగంగానే తమ భూమి మీద ఇతరుల ఆధిపత్యాన్ని ధిక్కరిస్తూ, కేంద్ర ప్రభుత్వ అధికారాన్ని ప్రశ్నిస్తూ ఇండియన్ తెగలు జరిపిన పోరాటానికి సాండినో నాయకత్వం వహించాడు. 1927 నుంచి అమెరికన్ సైన్యాలు సాండినోతో ఎడతెగని యుద్ధానికి దిగాయి. సాండినో నాయకత్వాన గెరిల్లాలు అమెరికన్ సైనికులతో కనీసం 500 సాయుధ ఘర్షణలకు తలపడ్డారు. చివరికి 1933లో అమెరికన్ ప్రభుత్వం తన సైన్యాలను వెనక్కి పిలిపించుకుని, నికరాగువాలో స్థానిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. కాని ఈ స్థానిక ప్రభుత్వం నికరాగువన్ పాలకులలో కెల్లా పరమ అభివృద్ధి నిరోధకులయిన నేషనల్ గార్డ్స్ చేజిక్కింది.

అమెరికన్ సైన్యాలు వెళ్ళిపోవడంతో దాదాపుగా విజయం సాధించామని భావించిన సాండినో దళాలు రాజధాని మనాగువాలో ప్రవేశించాయి. పీడిత వర్గాలకు న్యాయం చేకూర్చాలనీ, వ్యవసాయ సంస్కరణలను అమలుపరచాలనీ సాండినో కోరాడు. శాంతి గురించి చర్చించేందుకు రమ్మని సాండినోను నేషనల్ గార్డ్స్

అధిపతి అనస్తాషియో సొమొజా ఆహ్వానించాడు. సాండినోకు వ్యక్తిగత భద్రత కల్పిస్తానని సొమొజా వాగ్దానం చేశాడు. కాని ఆ సమావేశం ఏర్పాటయిన 1934 ఫిబ్రవరి 21న మనాగువాలో సొమొజా ఆదేశాల మేరకు సాండినోను హత్య చేశారు.

సాండినో మరణించిన తర్వాత రైతాంగ సాయుధ దళాలు దిక్సూచి లేని నౌకలాగ అయిపోయాయి. క్రమక్రమంగా బలహీనపడిపోయాయి. ఈ లోగా సొమొజా తనను తాను అధ్యక్షుడిగా ప్రకటించుకున్నాడు. జూదంతో, దొంగనోట్ల వ్యాపారంతో, చిల్లర వ్యాపారాలతో పైకి రాలేకపోయిన సొమొజా అమెరికన్ సైన్యం సహాయంతో, అమెరికన్ దౌత్యవేత్తల సహాయంతో నేషనల్ గార్డ్స్ అధిపతి అయి, అంతిమంగా నికరాగువా అధ్యక్షుడయ్యాడు. 20 సంవత్సరాలపాటు అతి క్రూరమైన, రక్తసిక్తమైన పాలన కొనసాగించాడు. సొమొజా స్వంత బ్యాంకు ఖాతా అంటే నికరాగువా జాతీయ ఖజానానే అని పాశ్చాత్య పత్రికలు వేళాకోళం చేసేంతగా జాతీయ సంపదను కొల్లగొట్టాడు. నికరాగువాలోని అత్యుత్తమైన ఆస్తులన్నిటినీ తన స్థిరాస్థిగా మార్చుకున్నాడు. కుటుంబ సభ్యులందరికీ అధికార పీఠంలో కీలక స్థానాలు కల్పించాడు.

సొమొజా నిరంకుశ పాలనకు దేశంలో ప్రతిఘటన ప్రారంభమైంది. ఈ ప్రతిఘటనలో అగ్రభాగాన నిలబినవాళ్ళు నికరాంగువన్ విశ్వవిద్యాలయ విద్యార్థులు. ఆ ప్రతిఘటన సంఘటితం కావడానికి ముందే 1956 సెప్టెంబర్ 21న రిగొబెర్టో లొపెజ్ పెరెజ్ అనే ఒక కవి, దేశభక్తుడు సొమొజా మీద దాడి చేసి చంపేశాడు ఈ ఘర్షణలో పెరెజ్ కూడ చనిపోయాడు. సొమొజా తర్వాత, సొమొజా కొడుకు లూయిస్ నికరాగువా అధ్యక్షుడయ్యాడు. 1963లో జరిగిన సాధారణ ఎన్నికలలో లూయిస్ స్థానంలో రెనెషిక్ అధికారంలోకి వచ్చినప్పటికీ సొమొజా కుటుంబ అధికారం చెక్కుచెదరలేదు. 1966లో రెనెషిక్ మరణించాక సొమొజా మరొక కొడుకు అనస్తాషియో తాచో సొమొజా నికరాగువా అధ్యక్షుడయ్యాడు.

పాలనా విధానాలలో, నిరంకుశత్వంలో, బంధుప్రీతిలో, అవినీతిలో తండ్రికీ, కొడుక్కీ ఏ మాత్రం తేడా లేదనిపించేంతగా తాచో సొమొజా పాలన సాగింది. ఐతే ఈ సమయంలోనే ఇరుగు పొరుగు దేశాలలో వస్తున్న మార్పులు నికరాగువా

ప్రజా పోరాటాన్ని ప్రభావితం చేశాయి. 1959 లో క్యూబాలో గెరిల్లాలు అధికారానికి వచ్చిన తరువాత నికరాగువాలో కూడ గెరిల్లాలు సంఘటితం కావడం ప్రారంభించారు. విడివిడిగా అనేక సాయుధ బృందాలు దేశంలోని వివిధ ప్రాంతాల్లో తలెత్తి రైతుల ప్రతిఘటనలకు నాయకత్వం వహించాయి. ప్రభుత్వ బలగాలతో తలపడ్డాయి. బ్యాంకులపై దాడి చేశాయి. గ్రామీణ ప్రాంతాల ప్రజా శత్రువులపై చర్యలు తీసుకున్నాయి.

ఈ విడివిడి పోరాటాలన్నిటి ఫలితంగా, 1961లో ఏర్పడిన సాండినిస్టా ఫ్రంట్ ఫర్ నేషనల్ లిబరేషన్ (ఎఫ్ ఎస్ ఎల్ ఎన్ - స్పానిష్‌లో ఫ్రెంటె సాండినిస్టా డి లిబరేషన్ నేషనల్) కేంద్ర సంస్థగా నికరాగువా ప్రజలు సొమొజా మీద జరిపిన వీరోచిత పోరాటం సంఘటితమైంది. 1966లో పొకాసన్ ప్రాంతంలో సాయుధ చర్యలు జరపాలని తీసుకున్న నిర్ణయం ద్వారా ఎఫ్ ఎస్ ఎల్ ఎన్ నిర్మాణ కార్యక్రమం ప్రారంభమైంది. ఎఫ్ ఎస్ ఎల్ ఎన్ గెరిల్లాలు దేశంలోని వివిధ ప్రాంతాలలో స్థావరాలు నిర్మించుకున్నారు. గౌటెమాలా, కోస్టారికా వంటి పొరుగు దేశాలలో పనిచేస్తున్న గెరిల్లా సంస్థలతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకున్నారు.

మధ్య అమెరికాలోని అన్ని దేశాల ప్రభుత్వాలూ, అమెరికన్ సైనిక సలహాదార్లతో కలిసి తమ తమ ప్రాంతాలలోని గెరిల్లా దళాలను "తుదముట్టించేందుకు" పథకాలు సిద్ధం చేశాయి. సొమొజా ఈ అణచివేత పథకానికి సహజంగానే నాయకుడయ్యాడు. 'అగ్విలాజెడ్ పథకం'గా పేరుపొందిన ఈ పథకం ప్రకారం "ఈ ప్రాంతంలో తిరుగుబాటును శక్తివంతంగా అరికట్టేందుకు" అన్ని మధ్య అమెరికా దేశాల ప్రభుత్వాలు సొమొజాకు సైనిక సహాయాన్నందించాయి. నికరాగువా ఉత్తర ప్రాంతంలోని కొండల్లో ఉన్న గెరిల్లా దళాలమీద ఈ సంయుక్త ప్రభుత్వ బలగాలు దాడులు చేశాయి. నికరాగువా, ఎల్ సాల్వెడార్, గౌటెమాలా, అమెరికా, హొండురాస్, కోస్టారికాల సైన్యాలు ఈ ఉమ్మడి దాడిలో భాగం పంచుకున్నాయి.

ఇంత పెద్ద ఎత్తున అమలయిన అగ్విలా జెడ్ పథకం కూడ సాండినిస్టాలను అణచివేయలేకపోయింది. సాండినిస్టా దళాలు దేశమంతటా విస్తరించాయి. 1978 ఆగస్టులో సాండినిస్టా సైనికులు మనాగువాలోని నేషనల్ పాలెస్ మీద దాడిచేసి

అక్కడ ఉన్న 500 మంది ప్రభుత్వాధికారుల్ని బందీలుగా పట్టుకున్నారు. అప్పటికి జైల్లో ఉన్న 59 మంది రాజకీయ ఖైదీల్ని విడుదల చేయాలని, ఒక కోటి డాలర్లు చెల్లించాలని, తాము చేసిన ప్రకటనను ప్రభుత్వ రేడియోలో పదే పదే ప్రసారం చేయాలని, తాము సురక్షితంగా వెళ్ళిపోయేందుకు వెనిజ్యూలా, మెక్సికో, పనామాలకు చెందిన విమానాలు ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఈ డిమాండ్లన్నిటినీ ప్రభుత్వం అంగీకరించింది. గెరిల్లాలు ఒక వెనిజ్యులన్ విమానంలో సురక్షితంగా పనామాకు వెళ్ళిపోయారు. సొమొజా మట్టికాళ్ళ మహారాక్షసి అని ఈ సాహసిక ఘటన ప్రతి ఒక్కరికీ తెలియజేసింది. నికరాగువన్ ప్రజలలోని మితవాద వర్గాలు కూడ సొమొజా పట్ల వ్యతిరేకతను బహిరంగంగా ప్రకటించడం ప్రారంభించాయి.

1978 సెప్టెంబర్ నుంచి ప్రారంభించి సొమొజా బలగాలకు, సాండినిస్టాలకు సాయుధ ఘర్షణలు తీవ్రతరమయ్యాయి. మాటాగల్పా, మనాగువా, మసాయా, దిరియాంబా, లియోన్, చినాన్‌దెగా, ఎస్టెలి మొదలైన పట్టణాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను ఎదురుబొదురు పోరాటాలు జరిగాయి. ఈ ప్రజావెల్లువను అణచివేసేందుకు ప్రయత్నించడంలో సొమొజా పాత నియంతలందరినీ మించిపోయాడు. మామూలు యుద్ధాల్లో లాగనే టాంకులు వీధుల్లోకి తీసుకొచ్చాడు. పట్నాలమీద విమాన దాడులు చేయించి, బాంబులు వేయించాడు. సైన్యాన్ని మొత్తాన్నీ ప్రజల మీదికి తరలించాడు. కాని ఎంత పెద్ద ఎత్తున అణచివేత కొనసాగించినా సొమొజా ప్రజా విజయాన్ని అడ్డుకోలేకపోయాడు. 1979 జులై 17న సాండినిస్టాలు మనాగువాలో విజయోత్సాహంతో ప్రవేశించారు. సొమొజా ఆ రోజే పెరాగ్వేకు పారిపోయాడు. సంవత్సరం తిరగకుండానే పెరాగ్వేలోని ఒక పట్టణంలో సొమొజా కాల్చి చంపబడ్డాడు.

మొత్తం మీద విప్లవ క్రమంలో 45000 మంది మరణించారు. ఒక లక్షా అరవై వేల మంది గాయపడ్డారు. నలభై వేల మంది అనాథలయ్యారు. దేశ ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నమైపోయింది. ఆర్థిక వ్యవస్థను మళ్ళీ సంఘటితం చేసి, రాజకీయ వ్యవస్థలో నుంచి ప్రజాశత్రువులందరినీ ఏరివేసి, నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజా ప్రభుత్వాన్ని నడపవలసిన బాధ్యత సాండినిస్టాల మీద పడింది. సొమొజా అనుకూల సైనిక బలగాలు (కాంట్రాలు) పొరుగున ఉన్న హొండురాస్ అడవుల్లో స్థావరాలు ఏర్పరుచుకుని నికరాగువా మీద దాడి చేయడం ప్రారంభించాయి. కాంట్రా

లకు అమెరికా బహిరంగంగాను, రహస్యంగానూ విపరీతమైన ఆర్థిక, ఆయుధ సహాయం అందించింది.

ఈ స్థితిలో 1990 ఫిబ్రవరి 25న నికరాగువాలో సాధారణ ఎన్నికలు జరిగాయి. అధ్యక్షుడు, 1970ల నుంచి పోరాట యోధుడు డానియెల్ ఆర్టెగా 41 శాతం వోట్లతో ఓడిపోయాడు. సమైక్య ప్రతిపక్షాల అభ్యర్థి, 'లాప్రెన్సా' పత్రికాధిపతి వయొలెటా బారియోస్ డి చమొరో 55 శాతం వోట్లతో గెలిచింది. 1979లో సాండినిస్టాలు అధికారం స్వీకరించినప్పుడు ఏర్పాటు చేసిన ఐక్యసంఘటన ప్రభుత్వంలో చేరమని వయొలెటాను కూడా ఆహ్వానించారు. సంవత్సరం తిరగకుండానే ఆమె తన పదవికి రాజీనామా చేసింది. సాండినిస్టాలు సోవియట్ అనుకూల, క్యూబన్ అనుకూల ప్రభుత్వాన్ని ఏర్పరుస్తున్నారనే పేరుతో వయొలెటా, ఇతర ప్రతిపక్ష నాయకులు, అమెరికా అనుకూలంగా మారిపోయారు. వాళ్ళ అధికార పత్రికగా 'లాప్రెన్సా' నికరాగువన్ విప్లవ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, అమెరికాకు అనుకూలంగా ప్రచారం సాగించింది. 1990 ఎన్నికల ప్రచారం కోసం నికరాగువన్ ప్రతిపక్షాలకు అమెరికన్ ప్రభుత్వం బహిరంగంగానే నిధులు అందజేసింది. విదేశీ సాయుధ జోక్యాన్ని కోరే, ప్రచారంచేసే బృందాలను అనుమతించడం, ఆ బృందాలు విదేశీ ఆర్థిక సహాయం కూడ పొందేందుకు అనుమతించడం ఆధునిక ప్రపంచ చరిత్రలో నికరాగువాలో మాత్రమే జరిగిన పనులు.

రాజకీయ, ఆర్థిక రంగాలలో అమలుచేసిన ఇటువంటి అపసవ్యమైన, ఉదారవాద వైఖరుల వల్లనే సాండినిస్టా ప్రభుత్వం కూలిపోవడానికి దారి సుగమమైంది. విప్లవాన్ని సుస్థిరం చేసేందుకు సాండినిస్టాలు అమలుచేసిన విధానాలు ఆ విప్లవం విఫలమైపోవడానికే దారితీశాయి. ఒక పేద, వెనుకబడిన దేశంలో గెలిచి, పది సంవత్సరాల పాటు అంతర్యుద్ధంలో కూడ నిలిచి, చివరికి సామ్రాజ్యవాదులు, స్థానిక విప్లవ వ్యతిరేకులు పన్నిన కుట్రలకు బలి అయిపోయిన నికరాగువన్ విప్లవం తన స్వంత లోపాల్ని కూడ ఇవాళ అంచనా కట్టుకోవలసే ఉన్నది.

విదేశీ, స్వదేశీ ఉన్నత వర్గాలకు నికరాగువన్ విప్లవ ప్రభుత్వం అనేక రాయితీలు కల్పించింది. తన ఉదారవాదాన్నీ, విశాల దృక్పథాన్నీ చాటుకునేందుకు

కల్పించిన ఈ రాయితీలు ఏకపక్షంగా మాత్రమే సాగాయి. ఉన్నతవర్గాల చేతిలో దుర్వినియోగానికి గురయ్యాయి. విప్లవ ప్రతిఘాతుక రాజకీయాలు పెంచి పోషించ బడేందుకు ఈ రాయితీలే కారణమయ్యాయి. విదేశీ శత్రువులకు అవకాశమిచ్చేలా రూపొందిన "మిశ్రమ ఆర్థిక" విధానాలు అంతిమంగా సాండినిస్టాల ఆశయాన్నే దెబ్బతీశాయి.

విప్లవ యుద్ధ పరిస్థితులలో శాంతినీ, ఆర్థిక పునర్నిర్మాణాన్నీ సాధించి రాజ్యాంగ యంత్రాన్ని సంఘటితం చేసుకున్న తర్వాతనే ఎన్నికలు జరపవలసి ఉండగా ఆర్టెగా ప్రభుత్వం అమెరికన్ల ఒత్తిడికి, స్థానిక ఉన్నతవర్గాల ఒత్తిడికి తల ఒగ్గి ఎన్నికలు నిర్వహించింది.

ఈ విధానాల ఫలితంగా వయొలెటాకు, ఆర్టెగాకు మధ్య పెద్దతేడా ఉన్నట్టు ప్రజలు భావించలేదు. ఇద్దరి మధ్య ఆర్థిక, రాజకీయ విధానాలలో స్పష్టమైన తేడా కనబడనప్పుడు సాండినిస్టాలను ఎన్నుకొని కాంట్రా దాడులను, అమెరికన్ బెదిరింపులను ఎదుర్కొనడం వృథాప్రయాస కాదా అని నికరాగువన్లు భావించడం సహజమే. విప్లవ ప్రతిఘాతకులు విజయం సాధించడానికి ప్రజలలో కలిగిన ఈ నిర్లిప్తతే కారణం. ఐతే ఈ నిర్లిప్తతకు మూలం మాత్రం సాండినిస్టా ఆర్థిక, రాజకీయ విధానాలలోనే ఉంది.

శతాబ్దం పైగా సామ్రాజ్యవాద కుట్రలకు, ఐదుదశాబ్దాలుగా నిరంకుశ పాలనకు గురి అయి, రక్తతర్పణ చేసి విప్లవం సాధించుకుని, తమదైన ప్రభుత్వాన్ని ఏర్పరచుకున్న నికరాగువన్లు విప్లవం అధికార మార్పిడితో పూర్తి అయినట్టు కాదని, సకల సామాజికార్థిక రాజకీయ రంగాలలో ప్రజాధికారం సాధించే క్రమం మాత్రమే విప్లవ విజయానికి హామీ ఇవ్వగలదని మరోసారి హెచ్చరిస్తున్నారు.

---

# విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం

మాగ్జిం గోర్కీ

(గత సంచిక తరువాయి)

మనిషి క్రమేపీ మానసికంగా పతనోన్ముఖుడు కావడం, "నేను" కుంచించుకు పోవడం గురించి సమీప భవిష్యత్తులో ఎవరైనా సాహసికుడు "విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం" పేర సవివరంగా ఒక బాధాకరమైన ఉద్గ్రంథమే రాయొచ్చు.

సృజనాత్మక శక్తుడిగి, ఇహసౌఖ్యాలపై దృష్టి కేంద్రీకరించిన వారి మానసిక స్థిరత్వానికి అగ్నిపరీక్ష వంటిదని చెప్పదగిన 19వ శతాబ్దం "వ్యక్తిత్వం విచ్ఛిన్నం" కావడంలో నిర్ణయాత్మకమైన ప్రధాన పాత్రనే పోషించింది.

అందుకు కారణం వైజ్ఞానిక వికాసమేనా? అది కూడా ఒక కారణమే. అయితే ఈ వికాసాన్ని తక్కువ చేయడానికి కూడా లేదు. అది తనకు తానే సాటైన రంగం- ఎందుకంటే ఇది సమష్టి శ్రమ ఫలితమేగాని వ్యక్తిగత కృషి విజయం కాదు. సాంకేతిక రంగం ఫ్యాక్టరీలో కార్మికుల మధ్య ఎదుగుతూ పోతుంది. ఆఫీసుల్లో జరిగేదేమంటే కార్మికులు తమ సమష్టి కృషి ఫలితంగా సాధించిన విజ్ఞాన సంపదను ధారాదత్తం చేస్తే దానిని క్రోడీకరించడం, శ్రామికుల అనుభవాన్ని ప్రోది చేయడమూనూ. ప్రకృతి శాస్త్రానికి సంబంధించి ఎవరైనా ఏమైనా కనుగొంటే, మాట వరసకు మాత్రమే అవి వ్యక్తుల విజయాలవుతాయి. కావాలంటే చూడండి పదార్థ నిర్మాణానికి సంబంధించి ఈ మధ్య కనిపెట్టిన విషయాలన్నిటికీ మధ్య ఎటువంటి పొంతన ఉందో- వాటన్నిటిలోనూ సమష్టి లక్షణం కనిపిస్తుంది. ప్రకృతి శాస్త్రంలో సాధించిన విజయాలకు వ్యక్తివాదం మసిపూసి మారేడుకాయ చేయడానికి అప్రజాస్వామిక పద్ధతులలో ఎంత ప్రయత్నిస్తున్నా ప్రకృతి శాస్త్రం మాత్రం ఆ వత్తిళ్ళను తిప్పికొడుతూనే ఉంది. అంతేకాదు ప్రకృతిశాస్త్ర విజయాలు క్రమంగా సోషలిజానికి లోతైన, శక్తివంతమైన పునాదులుగా అభివృద్ధి చెందుతున్నాయి. అందుకే బూర్జువాలు తోకముడిచి ప్రకృతి శాస్త్రం నుంచి మెటా ఫిజిక్స్ అనే 'బ్రహ్మ పదార్థం' వైపు పరుగు లంఘించుకున్నారు.

పాలకవర్గాలు ఎప్పుడూ విజ్ఞానంపై గుత్తాధిపత్యం సాధించడానికే యత్నిస్తూ

వచ్చాయి. అందుకు అన్ని విధాలా కృషి చేశాయి. విజ్ఞానం ఏ కాస్తయినా ప్రజలకు చేరిందంటే ఆ మాత్రమైనా పాలకవర్గాలు ప్రజలపై తమ అధికారాన్ని ఒడుపుగా కాపాడుకోవడం కోసం అనుమతించడంవల్లే. ఈ విధ్వంసక విధానం ముసుగును 19వ శతాబ్దం ఒక్కసారిగా విదిల్చికొట్టి, యూరప్‌లో మేధోశక్తి ఎంత ప్రియమై పోయిందో నగ్నంగా చూపింది. ఆ దశలో బూర్జువా వర్గం పారిశ్రామిక, వాణిజ్య రంగాలను అభివృద్ధి చేయడం కోసం ఆత్మశక్తితో సహా తమ సర్వశక్తులనూ పెట్టుబడిగా వెచ్చించింది. ఈ వర్గం నైతికవర్తనపై అంతటితో తెర పడింది.

జీవన పోరాటంలో అన్ని రంగాలలో విజయం సాధించడానికి అవసరమైన విజ్ఞానశాస్త్రాన్ని పాలకులు ప్రజలకు అందుబాటులో లేకుండా చేశారు. ఎందుకంటే జ్ఞానపుష్టి వుంటే ప్రజలు పనిచేయడం మానేస్తారని భయపడ్డారు. మనిషి మానసిక శక్తి అభివృద్ధి కావడానికి ఎటువంటి కృషీ జరగలేదు. ఫలితంగా మనిషి సృజనాత్మక శక్తుల ప్రమాణాలు ఘోరంగా పడిపోయాయి.

జీవితం రానురాను మరింత సంక్లిష్టమవుతున్నది. ప్రతి పదేళ్ళకూ మారిపోతున్న సాంకేతిక ప్రగతి జీవన విధానాన్ని వేగంగా మార్చేస్తోంది. ఇకముందు కూడా ఇలాగే జరుగుతుంది క్రిందటి శతాబ్దపు తొలి రోజులలో పారిశ్రామిక, వాణిజ్య రంగాలు ఆవిష్కరించిన పరిస్థితులను ఎదుర్కోవడానికి పెటీ బూర్జువాలకు తగినంత సత్తా ఉంది, కాని తర్వాత తర్వాత సాంకేతికాభివృద్ధి పెరిగిపోవడం, పోటీ వ్యాపించడం, బూర్జువా వర్గం దాహం పెరగడం, అధికార ప్రాబల్యం కోసం ప్రాకులాడడం, దానిని కాపాడుకోవటం కోసం పెనుగులాట పెరగడం, వీటికి అర్థబలం, అంగబలం తోడు కావడం వంటి పరిణామాలు ఒకవైపు, ఉత్పత్తి రంగంలో అరాచకం అనివార్యంగా తీవ్రం కావడం మరొకవైపు చొచ్చుకురావడంతో మనిషి ఎదుర్కోవలసి వచ్చే పరిస్థితులు, ఆ ఎదుర్కొనే మనుషుల వ్యక్తిగత సామర్థ్యాల మధ్య అగాధం పెరిగిపోయింది. అతి ప్రయాస వల్ల ఇందులో మనిషి శక్తులుడిగిపోవడం, మేధస్సు సంపూర్ణంగా వినియోగంలోకి రాకపోవడం వంటి వైపరీత్యాలవల్ల బూర్జువా కుటుంబాలలోని మూడవ తరం ఎలా తయారైందో మన కళ్ళముందే కనిపిస్తోంది. ఈ తరం మనోవికారాలకు గురికావడం, నేరప్రవృత్తి పెరిగిపోవడం కనిపిస్తుంది. రష్యా, అమెరికాలలోని బూర్జువా కుటుంబాలలో విలువలు పతనం కావడం ఎక్కువగా కనిపిస్తుంది. బూర్జువా అభివృద్ధి వేగంగా జరిగి చారిత్రకంగా శైశవ దశలో

ఉన్న ఈ దేశాలు తమ బూర్జువా వర్గాలలో అనల్ప మనోవైకల్యాన్ని సృష్టించాయి. తమ ముందుకు వచ్చిపడిన సంపదను తమకు బానిసగా చేసుకోవడానికి బదులు వాటికి తామే బానిసలయ్యారు. అంతటితో పెట్టుబడి వారిని పీల్చి పిప్పిచేసి, నిస్సత్తువులుగా మార్చేసింది. బహుశా చారిత్రక శిక్షణ లేకపోవడంవల్లే ఇలా జరిగిందనుకుంటాను. మనిషి ఏదైనా ఒక రంగంలో ప్రత్యేకత సంతరించుకోదలిస్తే, తన మానసిక శక్తి పెరుగుదలపై ఎక్కడో ఒకచోట తెర దించుకోవలసిందే. కాని అలా ప్రత్యేకత ప్రదర్శించడం మినహా బూర్జువాకు మరో దారిలేదు. తాను జీవించాలంటే ఆ మార్పు లేని గూడులోనే ఆ మనిషి నిరంతరం అల్లుకుంటూపోవాలి. అటువంటి సృజనాత్మకత ఫలితం అరాచకమే అన్నది నిర్వివాదాంశం.

పెట్టుబడి బూర్జువాలకు గల కొద్దిపాటి మేధో శక్తినీ హరించివేస్తే, బూర్జువాలకు ఎదురయ్యే మరో ప్రతీప శక్తి సోషలిస్టు పార్టీ. ఈ పార్టీ చేసే పని సమష్టి శక్తి అంటే ఏమిటో తరచు అనుభవంలోకి తీసుకురావడం.

పెట్టుబడిదారీ సంస్థలు ఏమి చేస్తుంటాయంటే తమ అవసరం కొద్దీ అవి వ్యక్తిత్వ వికాసాన్ని అరికడుతుంటాయి; వ్యక్తుల ఆశలకు, ఆకాంక్షలకూ, సాధించవలసిన లక్ష్యాలకూ ముడిపెడుతుంటాయి. అది మానసిక ఎదుగుదలకు అడ్డుపడుతుంటుంది.

అమెరికన్ కోటీశ్వరుడు గౌల్డ్ ఒక సందర్భంలో పెట్టుబడిదారుల ట్రస్ట్ గురించి చాలా బాగా చెప్పాడు. ట్రస్ట్ అంటేనే ఒక చిన్నగదిలో కలుసుకునే శత్రు సమూహమట. వారు చెట్టాపట్టాలేసుకుంటారు గాని అదనుచూసి పక్కవాడిని అంతం చేయడానికి వెనుకాడరట. ప్రతివాడికీ తమ గదికి అవల ఉన్న శత్రువు కంటే పక్కనున్నవాడే పెద్ద ప్రమాదకారిగా కనిపిస్తాడట. అటువంటి శత్రు దృష్టి గల సంస్థలలో వ్యక్తిత్వ వికాసానికి స్థానం లేదు. పరస్పర ప్రయోజనాల కోసం బయటకు కలిసి వున్నట్టు కనిపిస్తున్నా ఎవరికి వారే యమునా తీరే. అదే కార్మిక సంస్థలకైతే పోరాటం, విజయాలే పరమ లక్ష్యం. ఇక్కడ లోలోపలే ఒక ఏక రూప అనుభవం కోసం ఐక్యత ఉంటుంది. సోషలిజం సాధనకు అదే ఆయువుపట్టు.

సమష్టి భావనలవల్ల ఫలితంగా వచ్చేఅనుభవాల మేలు కలయికవల్ల ఇక్కడ వ్యక్తి మనో వికాసం అపారంగా పెరుగుతుంది. ఇక్కడ మనిషి మేధో శక్తి ఒక పద్ధతి

ప్రకారం నిరవధికంగా ఒకరికొకరికి అనుభవంలోకి వస్తుంది. ఇక్కడి వాతావరణం వ్యక్తిత్వ వికాసానికి ఏ రకంగానూ అవరోధం కాజాలదు—పైపెచ్చు అది అపారమైన స్వేచ్ఛను ఇస్తుంది. సమష్టి శక్తిని సాధ్యమైనంత ఎక్కువ పుంజుకోగలిగిన వ్యక్తి ఆ సమష్టి ప్రయోజనాల లక్ష్య సాధనకై, సంస్థను పటిష్ఠం చేయడానికై ఒక ప్రచారకుడు అవుతాడు, ఒక ఉపాధ్యాయుడు అవుతాడు. అలా కొత్త సభ్యులను ఆకర్షించగలుగుతాడు.

అదే పెట్టుబడిదారుల సంస్థలలోనైతే ఒకరకమైన ముఠాతత్వం కనిపిస్తుంది- ఏదైనా ఒక ప్రమాదం పొంచి ఉండడం వల్లగాని, తాత్కాలిక ప్రయోజనాలను నెరవేర్చుకోవడం కోసం గాని అటువంటి వారు ఒకటవుతారు. ఇక్కడ సృజనాత్మకతా లేదు, సామాజిక దృష్టిలేదు. వారి మధ్య సంబంధం అంతంత మాత్రమే. ఇందులో ప్రతివాడూ తనకు తానే ఒక నిర్దిష్టమైన, ఖచ్చితమైన "నేను" కాబట్టి అక్కడ చిరకాలం నిలిచిపోయే ఏకశక్తి గాని, ఐక్యభావంగాని ఉండదు. ఇక్కడ ప్రతివాడూ ఏదో ఒక పనికిమాలిన ప్రత్యేకతను ప్రదర్శించాలనుకుంటాడు, ప్రతివాడూ తనకు తానే విశిష్ట వ్యక్తిననీ, లేశమైనా మాలిన్యం లేనివాణ్ణనీ, తనకు తానే సాటిలేని మేటి అనీ భావిస్తాడు. తన ఇరుకు మనసుకు అందమైన బుకాయా తగిలిస్తాడు. ఇతరుల కంటె తాను ఎంత భిన్నమైనవాడో, ఎంత గొప్పవాడో చెప్పుకోవడానికి నానా యాతనా పడతాడు. అటువంటి అరాచక పరిసరాలలో సామాజిక విలువగల ఒక సంపూర్ణ వ్యక్తిగా "నేను" అవతరించడానికి అవకాశం లేదు. ఇక్కడ సమష్టి సజీవ అనుభవాలను భావాలరూపం లోనూ, సంకేతాల రూపంలోనూ అనునిత్యం శక్తివంతంగా వినియోగించే ఉత్తమ వ్యక్తిత్వం, సమష్టి ప్రయోజనాలకు బద్ధమయ్యే ఉత్తమ లక్షణాలు సంతరించుకున్న వ్యక్తిత్వ వికాసానికి చోటులేదు.

పరస్పరం సమూలంగా అంతం చేసుకోవడానికి శత విధాలా తీవ్రంగా యత్నించే అటువంటి సంక్షుభిత పరిసరాలలో ప్రతివాడూ ప్రతివాడికీ బద్ధ శత్రువే: ప్రతివాడూ పక్కవాడు ఎక్కడ మీదపడి తన గొంతు చీల్చేస్తాడోననే భయ విహ్వలంతో ఒక కన్నేసి ఉంచుతూ, తన కడుపులో చల్ల కదలకుండా చూసుకోవడం లక్ష్యంగా జరిగే జుగుప్సాకరమైన ఈ పోటీలో విజయం కోసం స్వతంత్రంగా గోదాలోకి దూకుతాడు. ఈ అనాగరిక యుద్ధంలో అద్భుతమైన మేధో సంపత్తి మొత్తం ఆత్మరక్షణలోనే వృథా అయిపోతుంది. తనను తాను రక్షించు కోవడం

కోసం పన్నే పన్నాగాలలోనే మనో శక్తిని వెచ్చించవలసి వస్తుంది. ఈ క్రమంలో మానవ అనుభవ సారానికి ప్రతీక అయిన "నేను" కాస్తా ఆ అనుభవం విస్తరించకుండా చేస్తూ, తుచ్ఛమైన ఇచ్ఛలకు బందీ అయిపోతుంది. మనిషికి కడుపులో చల్ల కదలకుండా ఉండడం కాక కావలసిందేముంది? ఆ క్రమంలో ఆ ప్రశ్నే ఒక ఆదర్శంగా మారిపోతుంది. తనకోసం దాన్ని సాధించుకోవడమే పరమావధిగా తలచి మనిషి దారి తప్పాడు, కృంగిపోయాడు, పతనమయ్యాడు, గాయపడ్డాడు, ఆగ్రహంతో శోకిస్తున్నాడు, అసహాయతతో క్షోభిస్తున్నాడు.

ఈ క్రమంలో వ్యక్తిగతమైన, అప్రధానమైన ప్రతి చిన్న సమస్య ప్రతివాని లోని "నేను" ముందు నిలిచి అందరికీ వర్తించే ఉమ్మడి ప్రమాదాన్ని అవగతం చేసుకోవడంలో అడ్డుపడుతుంది. ఇప్పటికే దుర్బలమైన బూర్జువాజీ తన ఆకాంక్షలను విశదీకరించే, తన అధికారాన్ని పరిరక్షించే శక్తివంతులను సృష్టించుకోవడంలో విఫలమైంది. అందుకే ఒకప్పుడు భూస్వాములకు వ్యతిరేకంగా వోల్టేర్‌ను, ప్రజలకు వ్యతిరేకంగా నెపోలియన్‌నూ ఈ వర్గం ముందుకు తెచ్చింది.

ప్రస్తుతం అమలులో వున్న సామాజిక నిర్మాణాన్ని పటిష్టం చేసుకోవడానికే తన శక్తియుక్తులన్నిటినీ ఇంతకుముందు ధారబోసిన పెటీ బూర్జువా వర్గం ఇప్పుడు కేవలం ఆ నిర్మాణం అలా ఉండడం సబబేనన్న వాదనతో నెగ్గుకు రావడానికి మాత్రమే తన శక్తిని ధారబోస్తున్నది. పతనోన్ముఖమవుతున్న యథాతథవాదుల స్థితిని ఇది సూచిస్తున్నది. ఈ పరిస్థితులలో కాంట్ వంటివాడు కొత్త రూపంలో పుట్టవల సిన అవసరం ఉందని వస్తువాదులు ఎప్పుడో గుర్తించారు. కాని కాంట్ ఆవిర్భ వించడం లేదు. పోనీ, ఆ తర్వాత వచ్చిన నీషే ఆమోదయోగ్యమా అంటే అదీ కాదు- యథాతథవాదుల ఏకైక ఆత్మరక్షణ సాధనం సామాజిక నిరాశావాదం. అది దుర్భరం; అది అసహాయతకు సంకేతం.

అయితే పెట్టుబడిదారీ విధానంలో ఎన్ని బలహీనతలున్నా అదింకా బలమైనదే, తన కాళ్ళపైన అది నిల్చున్నది. అయితే పోలీసు, సైన్యం, చర్చ, విద్యావిధానం మొదలైన ఉపాంగాలు దాని పతనాన్ని దూరంగా నెడుతున్నాయి. అన్ని రకాల అసత్యాలకు, అసహ్యాలకూ, అభిజాత్యానికీ ప్రతీక అయిన ఈ మహాశక్తిని కుప్ప కూల్చడానికి సంఘటితమవుతున్న పురోగామి శక్తులు ఎంత కృషిచేస్తున్నా దాని

ప్రభావం ఇంకా పెట్టుబడిదారీ కోట ముంగిటకు రాలేదు. అందువల్లే అది ఇంకా బలంగా కనిపించగలుగుతున్నది. బలమున్నమాటేగాని తాను సృష్టిస్తున్న విషానికి విరుగుడు లేక తనకు తానే అది విషప్రయోగం చేసుకుంటున్నది. ఆత్మాశ్రయం, వ్యక్తి స్వార్థం వంటి నీచధోరణులను మినహా మరి దేనినీ ఆమోదించని నిస్సహాయ విధ్వంసక వ్యక్తివాదం దానినుంచే పుట్టి చాప కింద నీరులా దాని పునాదులను కదిలించి వేస్తున్నది.

వ్యక్తిత్వం ఎంత దుర్బలంగా మారుతున్నదో సాహిత్యంలోనే కొన్ని ఉదాహరణలను బట్టి బాగా అర్థం చేసుకోవచ్చు.

సాహిత్యంలో తిరుగులేని కథానాయకులుగా డాంబే, గ్రాండే వంటి పాత్రలను సృష్టించడం 1848 వరకు సాగింది. (పారిశ్రామికాభివృద్ధి నేపథ్యంలో చార్లెస్ డికెన్స్ రాసిన నవల "డాంబే అండ్ సన్", ఆధునిక వ్యాపార ప్రపంచంలో రైల్వేల అభివృద్ధి తెచ్చిన మార్పులు ఈ నవలలో ప్రధానాంశం — అను.) ఇవి ఉక్కు మనుషుల వంటి పాత్రలు. ఆ శతాబ్దాంతానికి సెక్కార్డులా, మిర్బ్యూక్ నాటకంలోని కథానాయకులా డాంబే, గ్రాండేల స్థానాలను ఆక్రమించారు. వీళ్ళందరినీ మనోబలంతో ఏదో సాధించడానికి ముందుకు వచ్చిన పాత్రలుగా భావించినట్లయితే కాలంలో బాగా వెనుకకు పోతున్న కొద్దీ మనకు ఎక్కువ మనోబలం, చాలా స్పష్టంగా నిర్వచించుకున్న వ్యక్తి లక్ష్యాలూ, ఖచ్చితమైన ప్రయోజనాల నాశిస్తూ చేసిన ప్రయత్నాలూ వారిలో ద్యోతకమవుతాయి. తర్వాత తర్వాత వర్తమాన కాలంలోని వస్తున్న కొద్దీ సాహిత్యంలోని పాత్రలు అస్పష్టంగా, అప్రధానమైనవిగా మారిపోతుండడమే గమనిస్తాం. రానురాను ఈ పాత్రలలో జీవితంపట్ల నిర్లక్ష్య ధోరణి ప్రబలడం చూడవచ్చు. ఈ అందరిలోనూ వ్యక్తిత్వం భిన్నాభిన్నమైపోవడం కూడా కనిపిస్తుంది. స్వార్థ పరత్వం నెత్తిన ఒక పెట్టు పెట్టడానికి నైతిక బలం బౌన్నత్యాన్ని ఆవిష్కరించడానికే ఆ తర్వాత డికెన్స్ సైతం డాంబే పాత్రకు నీళ్ళు వదిలేశాడు. తర్వాం కాలంలో సెకార్డులా, రోబెర్ట్స్‌లా కాలగర్భంలో కలిసిపోయారంటే అది జోలా (ఎమిల్) ఘనత కాదు, అప్పటికే వారు జీవితంలోని నిర్దయాగుణంపల్ల నిష్క్రియాపరులై సాహిత్య రంగంలో మిగలకుండా పోయారు.

సాహిత్యం నుంచి ఒక్కసారి జీవితంపైపు దృష్టి సాగిస్తే అక్కడ కనిపిం

చేది కూడా సాహిత్యం ఆవిష్కరిస్తున్న వాస్తవాలకు భిన్నమైంది కాదు. ప్రజల మద్దతుతో ఫ్యూడల్ ప్రభువులపై విజయం సాధించిన బూర్జువాజీ, తమ అవసరాలను నెరవేర్చాలని ప్రజలు ఎప్పుడైతే కోరారో అప్పుడు భయ విహ్వలానికి లోనైంది- ఇప్పుడు కళ్ళముందు కొత్త శత్రువు కనిపిస్తున్నాడు — అంటే పాత కథకే మరో రూపం- ఆ భయాందోళనలో బూర్జువాజీ స్వేచ్ఛాగీతం నుంచి నిరంకుశాధికారంవైపు దృష్టి సారించుకుని ముందు నెపోలియన్‌కు, ఆ తర్వాత బూర్బన్స్‌కూ అధికారం కట్టబెట్టింది- అయితే అధికారాన్ని పటిష్టం చేసుకోవడం కోసం బయట నుంచి అందిన ఈ రక్షణ కవచం వ్యవస్థ లోలోపల కుళ్ళిపోవడాన్ని ఆపలేకపోయింది.

మాంటెస్క్యూ, వోల్టేర్, సర్వ సమగ్ర వాదులూ బూర్జువా వ్యవస్థ పరిరక్షణ కోసం తయారుచేసిన సిద్ధాంతంలోకి ఒక ప్రమాదకరమైన అంశం చొచ్చుకు వచ్చేసింది. అదే హేతు దృష్టి. అది మనుషులందరూ సమానమంది- ఈ దృష్టిని అలవరచుకోవడం వల్ల ప్రజలు బూర్జువాతో సమానంగా రాజకీయ సమానత్వాన్ని మరింత గట్టిగా కోరగలుగుతున్నారు- అక్కడినుంచి ఆర్థిక సమానత్వాన్ని సాధించడానికి ఉత్తేజపరిచేది కూడా ఆ తార్కిక దృష్టే.

బూర్జువా స్వార్థపరత్వానికి, ప్రజల హేతు దృష్టికి మధ్య ఘర్షణ ప్రారంభం కావడంతో ప్రపంచ స్థితిగతులలో లేని నిర్హేతుకత్వాన్ని రుజువు చేయడానికి బూర్జువాజీ యాతన ప్రారంభమైంది. అన్నిటికీ తానే కేంద్ర బిందువుగా ఊహించుకున్న బూర్జువాజీ తాను జీవిస్తున్న ప్రపంచాన్ని, తాను కొత్తగా సంక్రమించుకున్న ఆలోచనారీతులనూ తప్పు పట్టడం ఆరంభించింది.

"ఇరవై దశకంలో (వ్యక్తిగత) నిరాశావాదం ప్రదర్శనే ఒక 'ఫాషన్' అయిపోయింది- సమాజం దృష్టిని ఆకర్షించడానికి అదొక్కటే మార్గమని ప్రతి మూర్ఖుడూ తల పోస్తున్నాడు" అని షఖోవ్ ఒక సందర్భంలో అన్నాడు

నాకేమనిపిస్తుందంటే "మూర్ఖుడు" అనే వాడు శోభించడానికి తగు కోణం ఉంది. జీవితం తన ముందుకు తీసుకువస్తున్న కొత్త పరిస్థితులు తనను ఎంత అచేతనంగా మారుస్తున్నాయో, ఎంత అసహాయ స్థితిలోకి నెట్టుతున్నాయో గుర్తించక

(తరువాయి 67వ పేజీలో)

ప్రతిస్పందన :

## నెల్సన్ మండేలా

173వ సృజన సంపాదకీయం సరిగాలేదనిపిస్తుంది. 'భగత్‌సింగ్‌ని బలిపెట్టిన పాలకులే ఇవాళ ఆయనను పోరాట యోధుడంటున్నారు. ఆయన వారసులను విధ్వంసకారులంటున్నారు. అదే నోటితో నెల్సన్ మండేలాకు నీరాజనాలు పలుకుతున్నారు' అని రాశారు.

'మన నేలమీద జరుగుతున్న పోరాటాల మీద నిప్పులు కురిపించేవాళ్ళే నెల్సన్ మండేలాకు ఎర్ర తివాచీ ఆహ్వానాలు పలుకుతారు' అని రాస్తూ నెల్సన్ మండేలా సాయుధ పోరాటాన్ని కొనసాగించాలనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడనిపించే కొటేషన్ ఇచ్చారు.

నెల్సన్ మండేలా లాంటి వీరులు చేస్తున్న సాయుధ పోరాటాన్ని పొగుడుతున్న పాలకవర్గాలు, అదే తరహాలో సాయుధ పోరాటం చేస్తున్న భారత విప్లవకారులను విధ్వంసులుగా ప్రచారం చేస్తున్నారని సంపాదకీయంలో రాశారు.

నెల్సన్ మండేలాను సంపాదకులు పొరపాటుగా అంచనా వేసుకున్నారనిపిస్తుంది. జైలులో ఉన్నంతకాలం సాయుధ పోరాట జపం చేసిన మండేలా విడుదలై రాగానే ఆయుధాల్ని సముద్రంలో విసిరి పారేయండని ప్రజలకు పిలుపిస్తున్నాడు. (ఫిబ్రవరిలో ఒక మీటింగులో ఈ పిలుపిచ్చాడని ఈనాడు పత్రికలో వచ్చింది తేదీ గుర్తులేదు) ఆ తర్వాత కూడా హింసను ఆపండి అని ప్రజలకు విజ్ఞప్తి చేశాడట. దీనినిబట్టి మనం మండేలాను ఏ విధంగా అర్థం చేసుకోవాలి. చరిత్రలో గాంధీ నిర్వహించిన పాత్రనే యిప్పుడు మండేలా నిర్వహిస్తున్నాడు. దక్షిణాఫ్రికా పాలకులతో చర్చలు జరిపేముందు చర్చలకుగాను తామే కొన్ని షరతులు విధించాల్సింది పోయి, హింసను ఆపండి అని ప్రజలకి విజ్ఞప్తి చేస్తున్నాడు. ప్రజల ప్రతిహింసని 'హింస'గా వర్ణిస్తున్న మండేలాకు చరిత్రలో గాంధీకి పట్టిన గతే పడుతుంది.

గాంధీ వారసుడు లాంటివాడు కనుకనే మన పాలకవర్గాలు మండేలాకి నీరాజనాలిచ్చి ఆహ్వానాలు పలుకుతున్నారు. అతన్ని భగత్‌సింగ్‌ని పొగిడినట్టు పొగట్టం ద్వారా అతను కూడా భగత్‌సింగ్ అంత గొప్పవాడు అని ప్రజల్లో భ్రమలు రేకెత్తించడమే పాలకుల ఉద్దేశ్యం.

మండేలా నిజమైన పోరాటయోధుడే అయితే మన పాలకులు అతనికి ఏ తీవ్రవాదిగానో ముద్ర తగిలించి వుండేవారు కదా ? అట్లాంటి మండేలాను తమ వర్గ ప్రయోజనం కోసమే పాలకులు పొగుడుతున్నారు. ఆహ్వానాలు పలుకుతున్నారు.

అయితే సృజన పత్రికవారు కూడా నెల్సన్ మండేలాని పోరాట యోధుడంటూ వర్ణించడం ఆశ్చర్యం కలిగించింది. పాలస్తీనా పోరాట నాయకుడు అరాఫత్, నమీబియా నాయకుడు సుజోమా ఇలాంటి వారంతా సామ్రాజ్యవాదులతో అంతిమంగా లాలూచీపడే జాతీయవాదులే కదా ? ఇలాంటివారి రాజీతత్వాన్ని ఎండగట్టాల్సింది పోయి వీరిని పొగడటం ఆశ్చర్యం కలిగిస్తుంది నెల్సన్ తదితర నాయకుల్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలో అన్ని వివరాలతో సృజనలో వ్యాసం వస్తే బాగుండును'

ఇక అదే సంపాదకీయంలో 'భద్రలోగ్ భావజాలం', 'భద్రలోగ్ నిర్లిప్తత. అనే పదాలు ఉపయోగించారు. కొత్త పదాలు సామాన్యుల కర్థం కానివి ఉపయోగించినపుడు వాటి వివరం చివర్లో విడిగా యిస్తే బాగుంటుంది. 'స్టోలిపిన్ నిర్బంధ కాలం' అనే పదం కమ్యూనిస్టు పత్రికల్లో కొత్తగా చదివినపుడు స్టోలిపిన్ అనే దానికి అర్థం తెలియక తన్నుకున్నాం. తర్వాత తెలిసింది. సృజన కేవలం మేధావుల కోసమే కాదుకదా! అందుకని సామాన్యులని కూడా దృష్టిలో వుంచుకుని కొత్త పదాల అర్థాలు ఇస్తారని ఆశిస్తున్నా. సృజన అభివృద్ధిని ఆకాంక్షిస్తూ

— జి. మోహన్

విజయవాడ.

---

(66వ పేజీ తరువాయి)

మానడు. తన మానసిక శక్తుల్ని హరించుకు పోతున్నాయి. వ్యాపార ధోరణి అన్ని రంగాలలోనూ విస్తరించుకుపోతూ, తనను వంచనకూ, అవమానాలకూ గు చేస్తున్నది.

ఈ క్రమంలోనే ఇప్పుడు నశిస్తున్న వ్యక్తి వాదానికి ముక్తి ప్రసాదించడానికి యత్నాలు జరుగుతున్నాయి. ప్రాపంచిక విషయాలను విస్మరించడం ద్వారా మనో విరాడంబరత సాధించాలన్న వాదనలు ముందుకు వస్తున్నాయి. ఇవి ఇంతకు ముందు కూడా వినవచ్చాయి గాని డాంబిక ప్రధానమైన పెద్ద మనుషులలో ఇప్పుడు వీటిపట్ల కనిపిస్తున్న ఆసక్తి గతంలో కనిపించలేము. అందరి ఆమోదం చూరగొంటున్న ఈ వాదం మేధో జీవులలో పెరిగిపోతున్న దివాలాకోరుతనానికి సంకేతం.

జీవితంలో తన వైఖరిని సమర్థించుకునేటప్పుడు బూర్జువాజీ ప్రజలకు వ్యతిరేకంగా తాను చేసే యుద్ధం సబబైనదేనని ఎవడు వాదిస్తాడు- మారు మాట్లాడితే తన సంస్కృతిని కాపాడుకోవలసిన బాధ్యతను ప్రపంచ చరిత్ర తన భుజ స్కంధాలపై మోపిందని, ఇప్పుడు తాను చేస్తున్న పనికూడా అదేనని బుకాయిస్తాడు.

(మిగతా వచ్చే సంచికలో)

---


ఆకాశం అలలమధ్య
కొండ సిగలో సూర్యుడు
గోండన్నలు మోగించిన
తుడుం పిలుపు సూర్యుడు